# ఆత్మానాత్మ వివేకము

(శ్రీ మదాద్య శంకరాచార్య విరచితం)



నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

# గ్రంథకర్త పరిచయం

ప్రఖ్యాత రచయిత, విమర్శకులు, వక్త, ఉపాధ్యాయులు అగు శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారు సంస్కృతాంధ్ర ఆంగ్ల, హిందీ భాషలలో పండితులు. స్వయంకృషితో తెలుగు, ఇంగ్లీషు, హిందీ భాషలలో అనేక పట్టములు సంపాదించారు. 1943-48 సంవత్సరాలలో గాంధీ గారి నిర్మాణ కార్యక్రమములో చురుకుగా పాల్గని ఖద్దరు, హిందీ భాషా ప్రచారము చేశారు. తరువాత కృష్ణాజిల్లా పరిషత్ ఉన్నత పాఠశాలలో ఉపాధ్యాయులుగా చేరి 1977 లో ప్రధానోపాధ్యాయులుగా పదవీ విరమణ చేశారు. ఆ కాలములో వారు రచించిన గ్రంథాలలో శుభోదయము, తుక్కాంబ, రఘునాధ విలాసము, 'పూర్వాంధ్ర, కవులు' ఆంధ్ర, ఉస్మానియా, మద్రాసు, మైసూరు విశ్వవిద్యాలయాలలో పాఠ్య గ్రంథాలుగా నిర్ణయించబడ్డాయి. ఉద్యోగవిరమన తరువాత వేద వాఙ్మయముపై అపారకృషి చేసి ఉపనిషత్తులు, బ్రహ్మసూత్రములు, భగవద్గీత, పాతంజల యోగ సూత్రముల వంటి విషయములపై సరళమైన తెలుగు భాషలో అనేక గ్రంథములు రచించిన సోమయాజులుగారు స్వతంత్ర భావనాశక్తి గల పండితులు 13-12-1922 తేదీన కృష్ణాజిల్లా తోట్టవల్లూరు గ్రామంలో జన్మించిన వీరు 2-2-1997 న తాడిగడప గ్రామంలో వారి స్వగృహమున దివంగతులైనారు.

# ముందుమాట

శ్రీ జగద్గురువులైన ఆదిశంకరులు రచించినవిగా వ్యాప్తిలో నున్న గ్రంథాలు వందల సంఖ్యలో ఉన్నాయి అవి అన్నీ ఆయన రచనలు కావని, అప్పుడప్పుడు ఆయన శిష్యులుగాని, భక్తులుగాని, ఆయన తరువాత వచ్చిన పీఠాధిపతులుగాని, (ఆయన స్థాపించిన పీఠాధిపతులు కూడా శంకరాచార్య నాయంతోనే ప్రఖ్యాతి చెందినవారున్నారు:) రచించి, తమ రచనలకు మాహాత్మ్యాన్ని, వ్యాప్తిని కలిగించటానికై శ్రీ ఆద్యకంకరుల కర్తృత్వాన్ని ప్రచారం చేశారని చాలామంది విమర్శకుల అభిప్రాయం. ప్రస్థానత్రయ భాష్యంతో బాటు, అనేక స్తోత్ర గ్రంథాలు, ప్రకరణ గ్రంథాలు, తంత్రగ్రంథాలు, ఆయన పేరున వ్యాప్తిలో ఉన్నాయి. తమకు ఆరాధ్యులైనవారికి తాము రచించిన గ్రంథాలయొక్క కర్త ృత్వాన్ని ఆరోపించటం మన భారతీయులకు క్రొత్త కాదు. నిజానికి వారికి కావలసింది తమ గ్రంథం వ్యాప్తికలోకి రావటం, – తమ పేరు ప్రచారంలోకి రావాలని కాదు. నిజంగా అంతటి స్వార్థరాహిత్యం అభినంతనీయమే. సామాన్య పాఠకులమైనట్టి మనకు, ఎవరు వ్రాసిన ఆ గ్రంథంలోని విషయమే కావలసినది. దానిని చదివి వంటపట్టించుకోవటమే మన పని. వడ్డించిన రుచికరమైన పదార్థాన్ని తృప్తిగా భుజించి, జీర్ణింపచేసుకోవటమే మన పని. వండిన వారెవరు ? ఎట్లా వండారు ? అనే తర్కవితర్కాలు మనకు అనవసరం గదా ! నిజానికి శ్రీ ఆద్యశంకరుల పేర వ్యాప్తిలోనున్న గ్రంథాలన్నీ తప్పకుండా చదవవలసినంతటి గొప్పవిగానే ఉన్నాయి. అందుచేతనే ఈ ప్రకరణ గ్రంథాలలో కొన్నింటిని ప్రచురిస్తే మన వేదాంత శాస్త్రాన్ని తెలుసుకోగోరే జిజ్ఞాసువులకు ఉపయోగంగా ఉంటుందని భావించాము.

ఈ సందర్భంలో మనం గమనించాల్సిన విషయాలు కొన్ని ఉన్నాయి. అవి ఏమంటే–ప్రస్థానత్రయ భాష్యం గాని, మూలం గాని అర్థం చేసుకోవటం కూడా చాలా కష్టమైన విషయం. సంప్రదాయ పద్ధతిలో అధ్యయనం చేసినవారికే అంతంత మాత్రం !

ఇక సామాన్యుల మాట చెప్పేదేముంది? సంప్రదాయజ్ఞులు, ఆ ప్రస్థానత్రయాన్ని ప్రవచిస్తూ ఉంటే విని అర్థం చేసుకోవటం కూడా చాలా కష్టం. లోకంలో ఒక హాస్యోక్తి ప్రచారంలో ఉంది-ఏమని? "చెప్పేవానికి మాత్రమే తెలిసి, వినేవాళ్ళకు ఏ మాత్రమూ తెలియనిది న్యాయశాస్త్రం అని, చేప్పేవానికి, వినేవానికి కూడా తెలియనిది వేదాంత శాస్త్రమని!" తన కక్షిదారుల తరపున వాదించే న్యాయవాది పేర్కొనే ప్రకరణాలు, అధికరణాలు. సూత్రలు, తీర్పులు, పారిభాషిక పదాలు ఆయనకు, ఆయనలాంటి తోటి ఎదుటి న్యాయవాదికి మాత్రమే తెలుస్తాయి. ఆయనకు డబ్బు యిచ్చిన కక్షిదారునికి అంతా అగమ్యగోచరమే; ఆయన చేసే ఆర్భాటం, బల్లగుద్దుళ్లు చూచి సతోషించాల్సిందే? అట్లాగే వేదాంత ప్రవచనాలు కూడా తర్కవితర్కాలతో, పూర్వపక్ష సిద్ధాంతాలతో, పారిభాషిక శబ్దాలతో, వాగార్భటులతో సామాన్యులకు అర్థం కాక, తమ సుకృతరాహిత్యాన్ని, తమ అజ్ఞాన్నాని తామే నిందించుకుంటూ ఇంటికి చేరటమే గతి?

దీనికి కారణం ఏమిటి ? అని ఆలోచిస్తే (1) చెప్పే విషయంలో ప్రయోగించే పారిభాషిక పదాలు వినేవాడికి, చదివేవాడికి అర్థం కాక పోవటం (2) పూర్వపక్ష సిద్ధాంతాల సుడిగుండంలో పడి వినేవాళ్ళు చేదివేవాళ్ళు ఉక్కిరిబిక్కిరి అవటం (3) చెప్పే విషయం శాఖా - చంక్రమణంగా ఉండి, తీరుతెన్నులు లోపించటం. ఈపై కారణాలవల్ల మన వేదాంత శాస్త్రం తన గొప్పదనానికి, ప్రపంచంలో తనకున్న స్థానానికి తగ్గ ప్రచారం పొందలేకపోతోంది. ప్రజానీకంలోకి చొచ్చుకుపోలేకపోతోంది. దానివల్ల నష్టపడేది మనము, మన భారతీయ మతం ! ఈ విపత్తు నుండి కాపాడాల్సిన భారం సామాన్యులైన ఆస్తికులమీదనే ఉంది. అదృష్టంకొద్దీ సమాజంలో ఆస్తిక్యభావం నశించలేదు-పెరిగింది-పెరుగుతోంది. దానిని సరియైన మార్గంలో నడిపించగల ఆధ్యాత్మిక నాయకత్వం అవసరమైంది.

ఈ పుస్తకంలో ఆత్మానాత్మ వివేకంతోపాటు-ఏది ఆత్మ? ఏది ఆత్మకాదు? అనే విషయంతోపాటు రాగాదులు, అభిమానం, అహంకారం, అవివేకం, అజ్ఞానం, వివేకం, జ్ఞానం, సాధన చతుష్టయం, శమదమాది షట్కము, షడ్విధలింగాలు, ఇంద్రియ నిర్వచనం, స్థూలసూక్ష్మకారణ శరీరాలు, జాగ్రత్ స్వప్న సుషుప్త్యవస్థలు, పంచీకరణం పంచకోశాలు మొదలైన విషయాలు చర్చించబడ్డాయి. సులభంగా అర్థమయ్యేటట్లు నిర్వచించారు. కాబట్టి వేదాంత గ్రంథాలు చదువుదామనే జిజ్ఞాసువులకు బాగా ఉపకరిస్తుంది- కొన్ని పారిభాషిక

పదాలు బాగా అర్థమవుతాయి కాబట్టి ! ఇటువంటి ప్రకరణ గ్రంథాలు చాలా ఉన్నాయి – ఆత్మబోధ, అపరోక్షానుభూతి, అద్వైతానుభూతి, వివేక చూడామణి మొదలైనవి. ఇటువంటి వాటివల్ల వేదాంత శాస్త్ర ప్రవేశం బాగా కలుగుతుందని, విషయం చక్కగా అర్థమై జిజ్ఞాసువులకు తృప్తిని కలిగిస్తుందని ఈవిధమైన గ్రంథాల ప్రచురణకు పూనుకున్నాం.

పాఠకుల ఆశీస్సులు, అభిమానం, ప్రోత్సాహం మమ్మల్ని ముందుకు నడిపిస్తాయని ఆశిస్తున్నాం !

–ప్రకాశకులు

# ఆత్మానాత్మ వివేకము

## 1

*దృశ్యం సర్వమనాత్మా స్యాద్ దృగేవాత్మా వివేకిన:।*
*ఆత్మా నాత్మా వివేకోఽ యం కథితో గ్రంథకోటిభి:              ।*

ఈ విశ్వంలో మనకు కనిపించే ఈ సమస్త పదార్థాలు అనాత్మయే ! అంటే ఆత్మకానివే! అంటే నశ్వరమైనవే ! వీటిని చూచేవాడు మాత్రమే (వివేకియైనవాడు మాత్రమే) ఆత్మ. అంటే బ్రహ్మ. ఈ ఆత్మకు, అనాత్మకు సంబంధించినట్టి (నిత్యము, అనిత్యము అయినవాటికి సంబంధించిన) వివేచన అనేక గ్రంథాలలో ప్రతిపాదింపబడ్డది.

దృశ్యము, అంటే–మనస్సు మొదలుకొని, మనకు స్థూలంగా కనిపించే పృథివ్యాది భూతాల పర్యంతం ఉన్న ప్రకృతి అంతా అనాత్మ– ఆత్మకానిది. ఈ కనిపించే సమస్తాన్ని చూచేవాడు (ద్రష్ట) ఆత్మ. అంటే, పరబ్రహ్మస్వరూపమైన పరమపురుషుడే ద్రష్ట అతడే నిత్యుడు. పురుషుడు, మనస్సు ఈ రెంటి సంయోగంవల్లనే సమస్త దు:ఖాలు పుడుతున్నాయి. అంటే–శుద్ధ బ్రహ్మస్మరూపమైన ఆత్మకు, అనాత్మయైనట్టి ప్రకృతి సంబంధమైన సంపర్కంవల్ల లేదా ఆత్మ ప్రకృతిలో ప్రతిబింబిచటంవల్ల సుఖదు:ఖాల అనుభూతి కలుగుతోంది.

ఈ పైన చెప్పిన దృశ్యము, ప్రకృతి, అనాత్మ, ఈ మూడు ఒకటే ! ఈ ప్రకృతి స్వరూపాలైన భిన్నరూపాలు, విభిన్న పరిణామాలు ఇవన్నీ ఆ ద్రష్టయైన పురుషుని అనుభవంకోసం ముక్తికోసం ఏర్పడ్డవి. అంటే– అనాత్మకు తనదంటూ ఒక శక్తి లేదన్నమాట. ఆత్మ దానియందు. ఉన్నంతసేపూ ఆ అనాత్మలోని శక్తి కనిపిస్తూ ఉంటుంది–ఆత్మ ఉన్నంత వరకు శరీరంలో శక్తి కనిపించినట్లు ! చంద్రునిలో ఉండే ప్రకాశం నిజానికి చంద్రునిదికాదు–సూర్యునివల్ల వచ్చింది సూర్యుడు దానిని (చంద్రుని) ప్రకాశింప

చేసినంతవరకే అది ప్రకాశిస్తుంది. అనాత్మగా మనం చెప్పుకొనే ఈ ప్రకృతియొక్క శక్తి కూడా అంతే ! దానికి ఆశక్తి ఆత్మవల్ల వచ్చింది ఆత్మ ఉన్నంతవరకు దానిలో ఆ శక్తి కనిపిస్తుంది.

వివేకియైనవాడు అంటే జ్ఞానవంతుడు. జ్ఞానవంతునికి అంతర్దృష్టి ఉంటుంది–అవివేకికి అది ఉండదు. అంతర్దృష్టి ఉండటంవల్ల వివేకియైన వాడు ఈ సుఖదు:ఖాలయొక్క మూలకారణాన్ని తెలుసుకోగలుగుతాడు. ఈ విధమైన వివేకంవల్ల ఈ ప్రపంచం, ఈ జీవితము, ఎండమావుల వంటివని తెలుసుకుంటాడు. కాబట్టి కోరికలను అదుపులో పెట్టుకూంటాడు. కోరికలవెంట పరుగెత్తుడు. ఇటువంటి వివేకం కలవారు ఈ ప్రపంచం అంతా అశాశ్వతమని, ఆత్మ ఒక్కటే శాశ్వతమని గుర్తించ గలుగుతారు.

## 2

*ఆత్మా నాత్మ వివేకః కథ్యతే।*

ఆత్మ, అనాత్మ ఈ రెంటిని గూర్చిన వివేచన చేస్తున్నాం.ఆత్మ చిన్మయమైనది. అంటే కేవల చైతన్యం అనాత్మ మృణ్మయమైనది. మానవుడు ఈ చిన్మయ మృణ్మయాల సంయోగం అని చెప్పవచ్చు. అంటే జడచేతనాల కలయిక అని చెప్పవచ్చు. బుద్ధి, అహంకారం, ఇంద్రియాలు, వీటిని అనుసరించేవాడు అథః పతనాన్ని పొందుతాడు. అంటే, దుః ఖభాజనమైన ప్రపంచంలో–అనాత్మలో పడి పుడుతూ చస్తూ ఉంటాడు. చిన్మయ స్వరూపము, అవ్యక్తము, శాశ్వతము అయిన ఆత్మను గురించి ఆలోచిస్తూ, ఆత్మచింతనలో లీనమై ఉండేవాడు చివరకు సచ్చిదానంద స్వరూపుని, పరమాత్మను పొందుతాడు. క్లుప్తంగా చెప్పుకోవాలంటే ఇదే ఆత్మానాత్మా భావ వివేకము. సాంఖ్య దర్శనాన్నిబట్టి అనాత్మయైన ప్రకృతియే ఈ సమస్త సృష్టికి నిమిత్తకారణం, ఉపాదానకారణం. (కుండకు కులాల చక్ర దండ జలాదులు నిమిత్తకారణాలు. కుండకు మట్టి అనేది ఉపాదాన కారణం లేదా సమవాయి కారణం అంటారు) ప్రకృతికున్నట్టి ఈ అనాత్మ స్వరూపం సత్వరజస్తమస్సులనే మూడు ధాతువులతో కూడినది. తమస్సుతో కూడినది కేవలం అంధకారస్వరూపంకలదై ఉంటుంది–అజ్ఞానాత్మకము, స్థూలము అయి ఉంటుంది. రజోగుణమనేది క్రియాశక్తితో కూడినది. సత్త్వమనేది స్థిరమైనది. ప్రకాశం స్వభావం కలది అయిఉంటుంది. సృష్టికి పూర్వం

ప్రకృతియొక్క స్థితి, అవ్యక్తము, అవిశేషము, అవిభక్తంగా ఉంటుందనీ ఈ స్థితిలో సత్త్వరజస్తమస్సులనే మూడు గుణాలు సామ్యభావంతో ఉంటాయని, వీటిలో నామరూపాదులేవీ ఉండవనీ అంటారు. ప్రకృతిలో ఈ మూడు గుణాలయొక్కసామ్యావస్థ (సమాన స్థితి) తప్పిపోయి, విషయస్థితిని పొంది, వేరు వేరు రూపాల్లో మిశ్రితమైపోతాయి. అనాత్మ అనేదానిని, ఈ మూడు గుణాలతో కూడిన ప్రకృతియొక్క ప్రకాశమని, మహత్తత్త్వం, లేదా బుద్ధితత్త్వమని అనవచ్చు. విడి విడిగా ప్రతి మానవునిలోను కనిపించే ఈ బుద్ధితత్వమే సర్వత్ర వ్యాపించి ఉన్నట్టి సమిష్టి బుద్ధి తత్వానికి ఒక స్వల్పమైన భాగం అనవచ్చు. ఈ బుద్ధియొక్క దృష్టితో చూస్తే మనం బద్ధులమే! ఆత్మ దృష్టితో చూస్తే మనమంతా ముక్తులమే!

మానవుని యొక్క యధార్థ స్వరూపం అవ్యక్తమైన ఆత్మ అనే చెప్పుకోవాలి. అది కార్య కారణాలకు అతీతంగా ఉంటుంది. ఈ ఆత్మ అనేది అనాత్మ రూపంలో ఉండే ఈ ప్రకృతియొక్క సంయోగంవల్ల ద్రష్ట, దృశ్య రూపాల్లో కనిపిస్తాయి. అంటే ఆత్మ ద్రష్టిగాను, ప్రకృతిదృశ్యంగాను కనిపిస్తాయి–జగత్తు విభిన్న రూపాలుగా కనిపిస్తుంది. ఈ విధంగా ఆత్మ ప్రకృతి ఈ రెంటి సంయోగనికి కారణం ఏమిటి? అని ఆలోచిస్తే అజ్ఞానమే కారణమని తేలుకుంది. అవిద్యవల్లనే, అజ్ఞానం వల్లనే ఆత్మ అనేది ప్రకృతితో లేదా అనాత్మతో సంయోగం చెందుతోంది. ఆవిధంగా ప్రకృతి సంయోగం లేకుండా ఉండేది బ్రహ్మము మాత్రమే! బాహ్య ప్రకృతిని, అంతఃప్రకృతిని వశంలో ఉంచుకొని, ఆత్మయొక్క ఈ బ్రహ్మభావాన్ని వ్యక్తీకరించటమే జ్ఞానానికి లక్ష్యం అని చెప్పుకోవచ్చు.

## 3

*ఆత్మనః కిం నిమిత్తం దుఃఖం ? శరీర పరిగ్రహ నిమిత్తమ్।*
*"నేహ వై సశరీరస్య సతః ప్రియాప్రియాయో రపహతి రస్తీతి" శ్రుతేః॥*

ప్రశ్న : అయితే, బ్రహ్మస్వరూపమైన ఆత్మకు దుఖం ఎందుకు కలుగుతుంది? సమాధానం : శరీరాన్ని ధరించటంవల్ల ! ఈ శరీరధారులకు ప్రియము అప్రియము అనేవి నశించుట అనేది ఈ విశ్వంలో ఎన్నడూ వినని విషయం అని శ్రుతులు చెపుతున్నాయి. శరీరధారులకు ఇష్టానిష్టాలు, కష్టసుఖాలు తప్పవు అని భావం.

ఆత్మ అనేది నిత్యము అనశ్వరము, ఆనందస్వరూపము అని అంటున్నారు గదా!

అటువంటి ఆత్మకు దుఃఖం ఎందుకు కలుగుతోంది! అనేది ప్రశ్న. దుఃఖం అనేది శరీరానికి కలుగుతోందే తప్ప ఆత్మకు కలగటం లేదు అనేది సమాధానం! అజ్ఞానం (మాయ, భ్రమ) స్వరూపంగా గల శరీరానికే ఈ దుఃఖాలన్నీను. ఆత్మకు దుఃఖాలున్నాయని అనుకోవటం భ్రమ లేక అజ్ఞానం. ఈ దుఃఖాలు మూడు రకాలుగా ఉంటున్నాయి. 1. శరీరానికి కలిగే దుఃఖాలు. వీటినే ఆధ్యాత్మిక దుఃఖాలంటారు. ఇవి రెండు విధాలుగా ఉంటాయి. (అ) శరీరానికి కలిగే క్లేశాలు, జ్వరాలు ఇతర రోగాలు ఈ కోవకు వస్తాయి (ఆ) మనస్సుకు సంబంధించిన క్లేశాలు. కోరికలు, కోపం ఆశ,కోరినది లభించనందున కలిగే దుఃఖం మొదలైనవి. 2. భౌతికమైనట్టివి. ఇతర ప్రాణులవల్ల కలిగే దుఃఖాలు. క్రూరమృగాలవల్ల, చోరులవల్ల కలిగే దుఃఖాలు మొదలైనవి. 3. అదిదైవిక బాధలు. అగ్నిబాధలు, తుఫానులు. గ్రహబాధలు మొదలైనవి. ఈ బాధలన్నీ అనుభవించేది శరీరం. ఏదో పొందాలి. ఏదో కావాలి అనే కాంక్ష (కోరిక) ఈ బాధలకు కారణం! కోరిక తీరకపోవటమే దుఃఖానికి కారణం! ఈ కోరిక లనేవి లేకపోతే బాధలు ఉండవు. కోరిక ఉన్నంత వరకు బాధలు, దుః ఖాలు తప్పవు. ఈ కోరికలయొక్క యధార్థ స్వరూపం దుఃఖం అన్న మాట! ఈ సత్యాన్ని తెలుసుకొని కోరికలను అదుపులో పెట్టుకోగలిగినవాడు దుఃఖం నుండి రక్షింపబడతాడు. అహంకారం, రాగం ద్వేషం ఇవన్నీ కూడా దుఃఖానికి కారణాలే! ఇవన్నీ ఒక్కొక్క మనిషిలో ఒక్కొక్క మోతాదులో ఉంటాయి. జీవులు, జీవనవిధానాలు ఇన్ని రాకలుగా ఉన్నట్లు కనిపించటానికి కారణం ఇదే! వారి వారి కోరికలు. వారి రాగ ద్వేషాదులు వేరువేరు పరిమాణాల్లో ఉండటమే! ఈ కోరికలనేవి పూర్తిగా నశించటం ఆసంభవం! ప్రియాప్రియాలు, ఇష్టానిష్టాఉ పూర్తిగా నశించటవనేది ఈ సృష్టిలో మనం ఎన్నడూ వినలేదు. మనం మనిషిని శరీర రూపంలో మాత్రమే గుర్తిస్తున్నాం! అదే ఈ రాగద్వేషాలకు దుఃఖాలకు మూలం మనం మనిషిని ఆత్మరూపంలో గుర్తించగలిగితే రాగద్వేషాదులు ఉండవు. దుఃఖమూ ఉండదు.

## 4

*శరీర పరిగ్రహః కేన భవతి? కర్మణా!*

ప్రశ్న : మరి, అటువంటి దుఃఖానికి స్థానమైనట్టి శరీరాన్ని ఎందుచేత ధరించాల్సి వస్తోంది?

సమాధానం : కర్మవల్ల! అంటే, జన్మ జన్మాంతరాల్లో మనం చేసుకొన్న కర్మవల్ల! ఈ

కర్మయొక్క ఫలితాన్ని అనుభవించటంకోసం జన్మ అనేది కలుగుతోంది! ?అంటే, శరీరం ధరించాల్సి వస్తోంది.

మనం చేసే కర్మలు కొన్ని మంచివి, కొన్ని చెడ్డవి ఉంటాయి. ఈ జన్మలోనే కాకుండా వెనుకటి జన్మల్లో కూడా మనం ఇటువంటి కర్మలుచేసి ఉంటాం. ఆ కర్మలే శరీరానికి బంధనాలౌతాయి. అంటే మన ఈ శరీరం మనం చేసినట్టి శుభాశుభ కర్మలయొక్క సంస్కారంతో బంధింపబడి ఉన్నదన్నమాట. అటువంటి ఈ శరీరంతో మళ్ళీ కర్మలు చేస్తూ ఈ శరీరాన్ని ఇంకా బంధించుకుంటున్నామన్నమాట. అంటే, జీవాత్మ మాటిమాటికీ కోరికలతో అనేక కర్మలుచేస్తూ, ఆ కర్మఫలాన్ని అనుభవించటానికి అనేక జన్మలు పొందుతూ, చస్తూ జనన మరణాలనే చక్రంలో తిరుగుతోంది. అందుకే జన్మ అనేది ఎందుకు కలుగుతోంది? అనే ప్రశ్నకు 'కర్మణా' కర్మచేత అని సమాధానమిచ్చారు.

అయితే, ఈ కర్మను ఎవరు ప్రేరేపిస్తున్నారు? మనస్సు ప్రేరేపిస్తోంది. ఎట్లా? మనస్సే బాహ్యవిషయాల అభిఘాతంవల్ల – బాహ్య విషయాలు మనస్సును తాకటంవల్ల, పుట్టిన సంవేదనను (అనుభవాన్ని) ఇంకా తనకంటె లోపల ఉన్న నిశ్చయాత్మకమైన బుద్ధి ముందు ఉంచుతుంది. అప్పుడు బుద్ధియందు ఒకవిధమైన ప్రతిక్రియ ఏర్పడుతుంది. ఈ ప్రతిక్రియతోపాటు అహంభావం మేల్కొంటుంది. క్రియ, ప్రతిక్రియ వీటి కలయిక ఆత్మముందు ఉంచబడుతుంది. అప్పుడు ఆత్మ ఈ కలయికను కర్మరూపంలో గ్రహిస్తుంది. ఈ ప్రక్రియ అంతా విడదీయరానంత సన్నిహితంగా, వేర్పరరానంత వేగంగా జరిగిపోతుంది.

పంచేంద్రియాలు, మనస్సు, నిశ్చయాత్మక బుద్ధి, అహంకారం వీటి అన్నింటి కలయికను అంతఃకరణం అంటారు. ఇవన్నీ మనస్సుకు ఉపాదానమైన చిత్తంలో జరిగే ప్రక్రియలు. వీటిద్వారానే కర్మ అనేది ప్రభావితమౌతోంది. తప్పదుగదా! అటువంటప్పుడు ఈ కర్మనుండి ఇక మోక్షం (విముక్తి) లేదా? అంటే, కర్మయోగం ద్వారా కర్మయందు మమకారం ఆసక్తి, ఫలాపేక్ష లేకుండా కర్మచేయటం ద్వారా ఫలాఫలాలకు, రాగద్వేషాలకు, హర్షశోకాలకు అతీతుడై కర్మచేయటంద్వారా మోక్షాన్ని పొందవచ్చునన్నారు.

'మనిషికి శరీరమనేది బంధం. ఈ బంధనంతోనే మనిషి ఈ లోకంలోకి వస్తున్నాడు. ఈ శరీరమనేది కర్మఫల స్వరూపం అనుకున్నాం గదా! ఇంకా కోరికలతో కర్మలుచేస్తూ మనను మనమే బంధించుకుంటున్నాం. ఈ కర్మ శృంఖలాల నుండి విముక్తి పొందాలంటే

నిష్కామ కర్మయోగమే శరణ్యం. శరీరం లభించటం దోషంకాదు. ఈ శరీరంమీద ఆసక్తిని పెంచుకోవటం దోషం అని గ్రహించాలి.

## 5

*కర్మ కేన భవతీ చత్? రాగాదిభ్య ః।*

ఈ శరీరానికి బంధనరూపమైనట్టి కర్మ దేనివల్ల ప్రేరేపింపబడుతోంది? అని ప్రశ్న. రాగంవల్ల! అంటే, ఏదో పొందాలనే తృష్ణవల్లనే కర్మ పుడుతోందని, ఆ తృష్ణచేత ప్రేరేపింపబడే కర్మ చేస్తున్నారని సమాధానం.

రాగం అంటే ఏమిటి? ఏదైనా సుఖంగాని, సంతోషంగాని కలిగించే వస్తువు విషయంలో ఉండే మానసిక స్థితిని రాగం అంటారు. ఈ రాగం అనేదానివల్లనే ఆ వస్తువు లేకపోవటం అనే భావంవల్ల దానిని తాను పొందాలని, దాని సాన్నిధ్యం పొందాలని, దానిని రక్షించుకోవాలని ప్రబలమైన కోరిక పుడుతుంది. తాను పొందవలసిన సుఖం, లేదా పొందిన సుఖం, పొందుతున్న సుఖం పోతోందేమోననే కల్పనవల్ల రాగం పుడుతుంది. ఆ రాగంవల్ల కర్మకు ప్రేరణ కలుగుతుంది. అప్రాప్యమైన వస్తువు కోసమైన రాగం కలిగినప్పుడు కర్మకు కలిగే ప్రేరణ మనకు స్పష్టంగా గోచరిస్తుంది.

ఈ రాగం అనేది ఒక రోగంలాంటిది. ఇది మనస్సులో చేరి కర్మకోసం ప్రేరణను ఇంకా అధికం చేస్తూ ఉంటుంది. అందుచేతనే 'నాస్తి రాగసమం దుఃఖం' – రాగాన్ని మించిన దుఃఖం లేదన్నారు. మనం చెప్పుకొంటున్న ఈ రాగాన్నే సాంఖ్యులు 'మహామోహం' అని అంటారు. ఈ రాగానికి అష్టైశ్వరాలు విషయాలుగా ఉండటంవల్ల దీనికి ఎనిమిది భేదాలు చెపుతారు. (అష్టైశ్వరాలు–అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యం ఈశత్వం, వశిత్వం) అందుచేతనే రాగంవల్ల అని అనకుండా 'రాగాదిభ్య ః' రాగం మొదలైనవాటివల్ల అని సమాధానం చెప్పారు.

## 6

*రాగాదయః కస్మాత్ భవన్తీతి చేత్ । అభిమానాత్ ।*

రాగం మొదలైనవి దేనివల్ల పుడతాయి? అనేది ప్రశ్న.

అభిమానంవల్ల పుడతాయి అనేది సమాధానం.

రాగం అంటే ఏమిటో పైన తెలుసుకున్నాం. ఈ రాగం మొదలైన ప్రవృత్తులన్నీ అభిమానం వల్ల పుడుతున్నాయి. ఏ వస్తువైనా ముందుగా మన ఇంద్రియాలకు గోచరిస్తుంది. తరువాత మనస్సులో ఆలోచన పుడుతుంది. ఇది నాది. దీనిమీది అధికారం నాది. నాకోసమే! ఉన్నందల్లా నేనే! అంతా నేనే! అంతా నాకోసమే! అనేది అభిమానం. ఈ అభిమానం ప్రాణులన్నింటికి సహజమై! ఈ అభిమానం అనేదే అసాధారణ దర్మంగా పరిణమిస్తే ఆహంకారం ఆవుతుంది. దీనిని అనుసరించే బుద్ధి అనేది ఏ పనిచేయాలో నిశ్చయిస్తుంది.

అహంకారం అనేది చాలా జటిలమైనది. దీనినుండి విముక్తి అనేది కష్టసాధ్యం. పూర్తిగా అసాధ్యం మాత్రం కాదు. నిష్కాపట్యాన్ని, సరళస్వభావాన్ని (డంబాచారం, మిథ్యాభిమానం లేకుండా ఉండటం) అలవాటు చేసుకుంటే అహంకారాన్ని చాలాభాగం అదుపులో పెట్టుకోవచ్చు. అహంకారం అంటే–తాను ఏదో పొందాలని, తాను ఏదో కావాలనే (పదవి పొందాలనిగాని, ఇతర లౌకిక భోగభాగ్యాలను పొందాలనిగాని) భావం మాత్రమే! ఆ పదవికి, ఆ భోగాలకు తాను మాత్రమే అర్హుడననే భావం! ఈ అహంకారం తగ్గినకొద్దీ రాగాదిభావనలు తమంతటతామే తగ్గుముఖం పట్టి నీరసించిపోతాయి. రాగమనేది సాధనకు భంగకారి. లోపల అహంకారమనేది ఉన్నప్పుడే బయట రాగమనేది కనిపిస్తుంది. లోపల అహంకారం లేకపోతే బయట రాగమనేది ఉండదు. అహంకారమే రాగానికి మూలకారణం అని గుర్తించాలి. అంతేగాని రాగంవల్ల అహంకారం పుడుతోందని అనుకోరాదు. వీటిమధ్య నుండే అంతరం చాలా సూక్ష్మమైంది కాబట్టి అటువంటి భ్రమకు అవకాశం ఉంది.

## 7

*అభిమానోఽ పి కస్మాద్భవతి? అవివేకాత్।*

ఈ అభిమానమనేది దేనివల్ల పుడుతోంది? అనేది ప్రశ్న.

అవివేకంవల్ల పుడుతోందని సమాధానం.

అభిమానమనేది అవివేకంవల్ల పుడుతోంది. అవివేకం అంటే విచారణశక్తి లేకపోవటం. ఈ వివేకశక్తి (విచారణశక్తి) లేనివారికి అంతర్దృష్టి ఉండదు. అంతర్దృష్టి అంటే, విషయాలయొక్క, వస్తువుల యొక్క అంతఃస్థలాన్ని చూచేశక్తి; తెలుసుకొనే శక్తి,

వాటి స్వభావాన్ని గుర్తించే శక్తి, అంతర్దృష్టి లేకపోవటమంటే, సుఖదుఃఖాలు మొదలైన సమస్త విషయాలయొక్క వస్తువులయొక్క అంతఃస్థలాన్ని చూడలేకపోవటం. వాటి స్వభావాన్ని తెలుసుకోలేకపోవటం, గుర్తించలేకపోవటం అని భావం.

ఈవిధమైన అవివేకంవల్ల కలిగే ఫలం ఏమిటి? అంటే, అభిమానం అహంకారం అని చెప్పుకోవాలి. కాబట్టి మనం అభిమానం నుండి విముక్తులం కావాలంటే వివేకవంతులం కావాలన్నమాట. నిజానికి ఇది చాలా కష్టమైన విషయం. మానవుడు డబ్బు, భార్య పిల్లలు, పదవులు అన్నీ వదలిపెట్టగలుగుతాడు. కాని అభిమానాన్ని వదలలేడు– అహంకారాన్ని వదలలేడు. సన్యసించిన అభిమానం, అహంకారం తప్పటంలేదు– వదలటం లేదు. అయితే. దీని నుండి విముక్తి ఎట్లా? వివేకంవల్ల విముక్తి కలుగుతుంది. వివేకమనేది సత్యం. వివేకమనేది స్వభావమే తప్ప ఎక్కడినుండో బాహ్యంగా వచ్చేదికాదు. అవివేకమనేది అసత్యం. కల్పితం. ఈ జీవితంలోని వాదోపవాదాలు, శాస్త్ర చర్చలు, కల్పనలు, అనుమానాలు, తర్కాలు మొదలైనవన్నీ వివేకమనే సత్యాన్ని కప్పివేస్తూ ఉంటాయి. సత్యమైనట్టి వివేకాన్ని పొగలాగా కప్పివేస్తూ ఉంటాయి.

మనం చేయవలసిన పని ఏమిటంటే, పొగలాగా కప్పి ఉన్న అవివేకాన్ని తొలగించటం! అట్లా చేస్తే సత్యం గోచరిస్తుంది. అంటే, అవివేకాన్ని తొలగించుకొని జీవితాన్ని జీవితంగానే (సత్యంగానే) గుర్తించగలగటమనేది వివేకం. అప్పుడే మనకు అవివేకం నుండి అహంకారం నుండి ముక్తి లభిస్తుంది.

## 8

*అవివేక : కస్మాద్ భవతి! అజ్ఞానాత్। అజ్ఞానం కేన భవతీతి చేత్?న కేనాపి। అజ్ఞానం నామ అనాది సదసద్భ్యామనిర్వచనీయం త్రిగుణాత్మకం జ్ఞానవిరోధి భావరూపం యత్కించిదితి వదన్తి, అహమజ్ఞ ఇత్యాద్యనుభవాత్। 'దేవాత్మశక్తిం స్వగుణైర్నిరూఢామి' త్యాదిశ్రుతేః। తస్మాద జ్ఞానాదవివేకో జాయతే। అవివేకాదభిమానో జాయతే। అభిమానాద్ రాగాదయో జాయన్తే। రాగాదిభ్యః కర్మాణి జాయన్తే। కర్మభ్య : శరీర పరిగ్రహో జాయతే। శరీర పరిగ్రహాద్ దుఃఖం జాయతే॥*

అవివేకమనేది దేనివల్ల కలుగుతోంది? అజ్ఞానంవల్ల! అజ్ఞానం దేనివల్ల కలుగుతోంది? దేనివలనా కాదు, అని సమాధానం. ఎందువల్లనంటే– అజ్ఞానమనేది ఆదిరహితమైనది. అంటే నిత్యము, సత్, అసత్, అనిర్వచనీయం. మాయ, త్రిగుణాత్మకం. జ్ఞాన విరోధియైన భావాన్ని ఈ విధంగా అజ్ఞానం అని అంటారు. జ్ఞాన విరోధియైన భావన్నే 'నేను అజ్ఞానిని' ఇత్యాది మాటలద్వారా అనుభవంలో వ్యక్తంచేస్తారు. దేవశక్తి జీవాత్మశక్తి తన గుణాల ద్వారా ప్రచలితమై ఉంది అని వేదాలు చెపుతున్నాయి జ్ఞానంగాని అజ్ఞానంగాని వారి వారి స్వభావాల ద్వారా రావలసినవే! అందుచేత అజ్ఞానంవల్ల అవివేకం కలుగుతోంది. అవివేకంవల్ల అభిమానం పుడుతోంది. అభిమానంవల్ల రాగాదులు పుడుతున్నాయి. రాగాదులవల్ల కర్మలు పుడుతున్నాయి. కర్మలవల్ల శరీర బంధనం కలుగుతోంది. శరీర బంధనంవల్ల దుఃఖం కలుగుతోంది. ఈవిధంగా ఇంత వరకు చెప్పిన విషయాన్నే మళ్ళీ చివరి నుండి మొదటికి సింహావలోకనం చేసారు.

అజ్ఞానము, దుఃఖము అనేవి ఒకదానికొకటి కార్యకారణ భావంతో సంబంధం కలిగి ఉన్నాయి. ఎట్లా? చెట్టు బీజాన్ని ఉత్పత్తి చేస్తోంది. ఆ బీజమే మళ్ళీ చెట్టును ఉత్పత్తి చేస్తోంది. అట్లాగే అజ్ఞానం దుఃఖానికి కారణమైతే ఆ దుఃఖమే అజ్ఞానానికి కారణమౌతుంది. అట్లాగే ఈనాడు మనం చేస్తున్న కర్మలన్నీ పూర్వ సంస్కారానికి ఫల స్వరూపాలు గదా! ఈ కర్మలే మళ్ళీ సంస్కార రూపం దాల్చి కర్మ చేయటానికి కారణాలు అవుతున్నాయి. ఈ విధమైన కార్యకారణ ప్రవాహం నడుస్తూనే ఉంటుంది. అయితే ఈ ప్రహహానికి మూలంలో ఉన్నది ఏమిటి? అవిద్యాత్మకమైనట్టి అజ్ఞానం. ఈఅజ్ఞానం స్థితిలో దుఃఖం కలగటమనేది తప్పనిసరి. శరీర బంధనానికి కారణం కర్మ గదా। కర్మోత్పత్తికి కారణం రాగాదులు. ఈ రాగాదులు అభిమానంవల్ల పుడతాయి. అభిమానం అవివేకం వల్ల పుడుతుంది. అవివేకం అజ్ఞానంవల్ల పుడుతుంది. అజ్ఞానం అనేది స్వతః అవిద్య. కాబట్టి మళ్ళీ అజ్ఞానంవల్ల అవివేకం, అవివేకంవల్ల అభిమానం అభిమానంవల్ల రాగాదులు, రాగాదులవల్ల కర్మలు, కర్మలవల్ల శరీర బంధనం, శరీరబంధనం వల్ల దుఃఖం, ఇది ఒక వాత్యాచక్ర వంటిది గాలికి తిరిగే చక్రం లాంటిది.

కాబట్టి, దుఃఖం, అజ్ఞానం, అనే రెండూ ఒకదానికి ఒకటి కార్యకారణాలుగా ఉన్నాయి. అజ్ఞానం ఉన్నచోట దుఃఖం అనేది తప్పదన్నమాట.

## 9

*దుఃఖస్య కదా నివృత్తి ః? సర్వాత్మనా శరీర పరిగ్రహ నాశే సతి దుః ఖస్య నివృత్తిర్భవతీ సర్వాత్మ పదం కిమర్థం? సషుప్త్యవస్థాయామ్ దుఃఖే నివృత్తేఽ పి పునరుత్థాన సమయే ఉత్పద్యమానత్వాద్ వాసనాత్మనా స్థితం భవతి.*

దుఃఖమనేది ఎప్పుడు పోతుంది? అని ప్రశ్న. 'సర్వాత్మనా' (సర్వతోభావంగా–అన్నివిధాల) శరీరం ధరించటమనేది పోయినప్పుడు దుఃఖ వివృత్తి కలుగుతుంది అనేది సమాధానం అయితే, 'సర్వాత్మనా' అనేపదం ఎందుకు ప్రయోగించారు? అంటే గాఢ నిద్రలో (సుషుప్తిలో) దుఃఖమనేది నష్టమైనా (సంస్కార విశేషంగా) మళ్ళీ హాజరౌతోంది. మేల్కొనటంతోనే పూర్వం మనస్సును అంటి ఉన్న సంస్కారం కూడా ప్రత్యక్షమౌతోందన్న మాట. అందుకోసమే 'సర్వాత్మనా' అని సంపూర్ణంగా అని, చెప్పాల్సి వచ్చినది.

ఇంతవరకు మనకు తెలిసినదేమిటి? మనం మన అజ్ఞానం వల్లనే ఒక నిర్దిష్టమైన శరీరంలో మనల్నీ బంధించుకున్నాం. తద్వారా దుఃఖాన్ని తెచ్చుకొన్నాం–అనుభవిస్తున్నాం. ఈ శరీరమే నేను అనేది కేవలం కుసంస్కారం. ఈవిధమైన కుసంస్కారమే మనకు సుః ఖాన్నైనా, దుఃఖాన్నైనా ఇస్తోంది. అజ్ఞానంవల్ల కలిగిన ఈ కుసంస్కారంవల్లనే శీతాతప బాధలు, ఇతరమైన దుఃఖాలు అనుభవిస్తున్నాము. 'సర్వాత్మనా శరీర పరిగ్రహ వినాశేసతి' అని అనటంలో ఉద్దేశ్యం–ఈ శరీర విషయమై పూర్తిగా అనాసక్త భావంతో ఉండాలని. అంటే, ఆ చెడు సంస్కారాన్ని దాటి శరీరానికి ఆత్మకు ఉండే సంబంధాన్ని స్థిరపరచుకోవాలి. ఈ శరీరానికి, ప్రపంచానికి (ప్రపంచము అంటే మాయ లేక అజ్ఞానం) ఉన్న సంబంధం వదిలించుకోవాలి. ఈ సంబంధం ఉన్నంతవరకు దుఃఖం తప్పదు. కాబట్టి, శరీర విషయకమైన ఆసక్తిని పూర్తిగా అన్నివిధాల వదిలి పెట్టటం దుఃఖ నివృత్తికి సాధనమౌతుంది. నేను ఎవరిని? ఈ నా శరీరం ఏమిటి? నేను ఏమిటి? ఈ రెంటికిగల సంబంధం ఏమిటి? అన్ని ప్రశ్నించుకొని తన స్వరూపాన్ని తాను గుర్తించటం, ఆ గుర్తించిన స్థితిలో స్థిరంగా ఉండటం, ఇదే దుఃఖ నివృత్తికి మార్గము.

## 10

*అతస్తన్నివృత్త్యర్థం సర్వాత్మపదమ్ శరీరపరిగ్రహ నివృత్తి : కదా భవతి? సర్వాత్మనా కర్మణి నివృత్తే సతి। కర్మ నివృత్తిః కదా భవతి? సర్వాత్మనా రాగాదౌ నివృత్తే సతి। రాగాది నివృత్తి : కదా భవతి? సర్వాత్మనా అభిమానే నివృత్తి సతి కదా అభిమాన నివృత్తిః? సర్వాత్మనా అవివేకే నివృత్తే సతి। కదా అవివేక నివృత్తి :? సర్వాత్మనా అజ్ఞానే నివృత్తే సతి। కదా అజ్ఞాన - నివృత్తిః? బ్రహ్మాత్మైకత్వే జాతే సతి అవిద్యా నివృత్తిః సర్వాత్మనా భవతి॥*

అందుచేత, ఆ దుఃఖం నివృత్తిని చెప్పటం కోసం 'సర్వాత్మ' పదాన్ని ప్రయోగించారు. శరీర పరిగ్రహ నివృత్తి ఎప్పుడు జరుగుతుంది? సంపూర్ణంగా, సర్వతోభావంగా కర్మనివృత్తి జరిగినప్పుడు. మరి, కర్మ నివృత్తి ఎప్పుడు జరుగుతుంది? సర్వతోభావంగా రాగాదులు నివృత్తిమైనప్పుడు. రాగాదుల నివృత్తి ఎప్పుడు జరుగుతుంది? పూర్తిగా అభిమానమనేది నశించినప్పుడు. అహంకారం–అభిమానం ఎప్పుడు నివృత్తమౌతుంది? అవివేకం సంపూర్ణంగా నశించినప్పుడు. అవివేకం ఎప్పుడు నశిస్తుంది? అజ్ఞానం పూర్తిగా నశించినప్పుడు. అజ్ఞాన నివృత్తి ఎప్పుడు జరుగుతుంది? జీవాత్మలోను. పరమాత్మలోను ఏకత్వం సిద్ధించినప్పుడు అవిద్యా(అజ్ఞాన)నివృత్తి దానంతట అదే జరుగుతుంది.

జీవాత్మ పరబ్రహ్మతో ఏకీభావం చెందితే తప్ప దుఃఖ నివృత్తి అనేది అసంభవం అయితే ఈ సమత్వబుద్ధి (ఆత్మపరమాత్మలు ఒకటే అనే అభేదబుద్ధి) పొందటానికి ముందుగా మనం అంతర్జ్ఞానాన్ని మేల్కొల్పాలి. అంటే ఈ జ్ఞానం అనేది మనలోనే నిహితమై ఉంది– చెకుముకిరాతిలో అగ్ని నిహితమైన ఉన్నట్లు! మనలోనే నిహితమైయన్న జ్ఞానాన్ని మరియొక జ్ఞానంతో మేల్కొల్పాలి.

ఈ కనిపించే ప్రపంచంతో ఆత్మకున్న సంబంధం అనాదియైనది. ఇదే దుఃఖాలకు మూల కారణం ! ఆ అజ్ఞానంవల్ల కలిగిన సంబంధం ఎప్పుడు వదిలిపోతుందో అప్పుడిక దుఃఖాలు ఉండవు. ఆ స్థితిని పొందాలంటే (ప్రపంచంతో ఉన్న అజ్ఞాన బంధం వదలాలంటే) జీవాత్మకు పరమాత్మతోడి ఏకత్మజ్ఞానం కలగాలి. జీవాత్మ పరమాత్మల మధ్య సమత్వ భావం

కలగాలి. అటువంటి సమత్వభావం కలిగినప్పుడు అతడు ఏది చేసినా పరమాత్మ చేసినట్లు! పరమాత్మ కోసం చేసినట్లు అవుతుంది– సమస్తము బ్రహ్మార్పణమే అవుతుంది. ప్రతి ఆత్మ అవ్యక్తమైన బ్రహ్మమే! బాహ్యాభ్యంతర ప్రకృతుల్ని వశపరచుకొని, జీవుడు బ్రహ్మభావాన్ని వ్యక్తం చేయటమే ఈ మానవజీవితానికి లక్ష్యం. కర్మ, ఉపాసన, మానసిక నిగ్రహం, తపస్సు మొదలైనవాటి అన్నింటి సహాయంతోగాని, లేక ఏ ఒకదానినైనా ఆశ్రయించిగాని తన బ్రహ్మభావాన్ని వ్యక్తం చేసినప్పుడు ఇక దుఃఖమనేది ఉండదు. అదే జీవితానికి లక్ష్యం అని అన్నాం కదా. ఈ జీవబ్రహ్మ సమభావ మనేది సమస్త దుఃఖాలు నశించటానికి ఏకైక కారణం! మిగతా సాధనాలు ఏవైనా అన్నీ అప్రధానాలే!

## 11

*నను నిత్యానాం కర్మణాం విహితత్వాత్ నిత్యేభ్యః కర్మభ్యో అవిద్యా*
*నివృత్తిః స్యాత్ కిమర్థం జ్ఞానేన, ఇత్య శంక్య న కర్మాదినా అవిద్యా*
*నివృత్తిః తత్కృత ఇతి చేత్? కర్మజ్ఞానయోర్విరోధో భవేత్॥*

నిత్యకర్మల ద్వారా, విహితకర్మల ద్వారా అజ్ఞానం నశించిపోయేటప్పుడు ఇక జ్ఞానం యొక్క అగత్యం ఏముంటుంది? అనేది ప్రశ్న (నిత్యకర్మలు అంటే స్నాన సంధ్యావందనాది కర్మలు. విహితకర్మలు అంటే శాస్త్రంలో విధింపబడ్డ కర్మలు) పై ప్రశ్నకు సమాధానం చెపుతున్నారు. సంచిత కర్మల ద్వారా (సంపాదించుకొన్న కర్మల ద్వారా ) అజ్ఞానం నశించదు. ఎందుచేతనంటే, కర్మ–జ్ఞానం ఈ రెంటి మధ్య విరోధం ఉంటుంది– ఒకదాని కొకటి వ్యతిరేకమన్నమాట!

చాలామంది భ్రమకు లోనై, మాయకు వశులైన జ్ఞానాన్ని పొందలేక పోవటం కనిపిస్తోంది– అజ్ఞానంలో పుట్టి, అజ్ఞానంలోనే చస్తున్నారు. ఎవడికైతే తన అజ్ఞానం పూర్తిగా తెలుస్తుందో అతని జీవితంలో దానంతట అదే జ్ఞానోదయం అవుతుంది. ఈ జీవితంలో అనేకవిధాలైన కర్మలు చేస్తున్నాం. నిత్యకర్మలు చేస్తున్నాం. నైమిత్తిక కర్మలు చేస్తున్నాం. శాస్త్రంలో చెప్పబడిన అనేక కర్మలు, దానాలు, వ్రతాదులు చేస్తూనే ఉన్నాం. ఈ కర్మలన్నీ మనస్సు, బుద్ధి, ఇంద్రియాల ద్వారా పనులు చేస్తున్నాడు. అవే కర్మలు, ఈ కర్మలు పుణ్య కర్మలు కావచ్చు. పాపకర్మలూ కావచ్చు! వాటి ఫలాన్ని, పుణ్యాన్నైనా, పాపాన్నైనా, ఈ

జన్మలోనో, అనుభవానికి ఈ జన్మ చాలకపోతే–ఇంకొక జన్మలోనో అనుభవించాల్సి వస్తుంది. పుణ్యకర్మలు చేసినా, పాప కర్మలు చేసిన చివరకు మృత్యువుకు చిక్కక తప్పదు. జ్ఞానమనేది అఖండమైనది కర్మ అనేది ఖండం! కాబట్టి కర్మ అనేది ముక్తిని మృత్యువును ఇస్తుంది. జ్ఞానమనేది ముక్తిని ఇస్తుంది. ఈరెంటి మధ్య ఉన్న విరోధం ఇదే! కాబట్టి కర్మల ద్వారా అజ్ఞానం నశించదు అని ఫలితార్థం.

**12**

*అతో జ్ఞానేనైవ అజ్ఞాన నివృత్తిః తద్‌జ్ఞానం కుత ఇతి చేత్? విచారాదేవ భవతి। ఆత్మానాత్మ వివేక విషయ విచారాద్ భవతి। తస్మిన్ విచారే కోవా కో వా అధికారీ? సాధన చతుష్టయ సంపన్నోఽ ధికారీ। సాధన చతుష్టయం నామ-(1) నిత్యానిత్య వస్తువివేకః (2) ఇహాముత్ర ఫలభోగ విరాగః (3) శమాది షట్ సంపత్తిః (4) ముముక్షుత్వంచేతి। నిత్యానిత్య వస్తువివేకో నామ, బ్రహ్మ సత్యం, జగన్మిథ్యైవేతి నిశ్చయః ఇహ అస్మిన్ లోకే దేహధారణ వ్యతిరిక్తవిషయే స్రక్చందన వనితాది సంభోగే వాన్తాశన మూత్రపురీషాదౌ యథా ఇచ్ఛానాస్తి, తథా ఇచ్ఛా రాహిత్యమితి ఇహలోక విరాగః। అముత్ర స్వర్గలోకాది బ్రహ్మలోకాన్తర్వర్తిషు రంభోర్వశ్యాది సంభోగాదివిషయేషు తద్వత్। శమాదిషట్కం నామ, శమ-దమ-ఉపరతి- తితిక్షా-సమాధానం- శ్రద్ధా । శమో నామ-అంతరింద్రియ నిగ్రహః। అంతరింద్రియం నమ మనః। తస్య నిగ్రహః శ్రవణమనన నిదిధ్యానన వ్యతిరిక్త విషయేభ్యోనివృత్తిః। శ్రవణాదౌ వర్తమానత్వం వా శమః। శ్రవణం నామ షడ్విధ లింగైర శేషవేదాన్తానామ ద్వితీయవస్తుని తాత్పర్యావ ధారణమ్॥*

కాబట్టి, జ్ఞానం ద్వారా మాత్రమే అజ్ఞాననివృత్తి అనేది సంభవం అని తెలిసింది గదా। అయితే, ఆ జ్ఞానమనేది ఎట్లా లభిస్తుంది? అనేది ప్రశ్న. విమర్శించటంవల్ల–

విచారణవల్ల లభిస్తుంది అని సమాధానం. అంటే. జ్ఞానమనేది ఆత్మ, అనాత్మ ఈరెంటికి సంబంధించినట్టి వివేకాన్ని గూర్చిన విచారణ చేయటంవల్ల కలుగుతుంది అని భావం. అయితే ఇటువంటి విచారణ చేయటానికి (ఆత్మానాత్మ వివేకాన్ని గూర్చిన విచారణ) అధికారి ఎవరు? అనేది ప్రశ్న. సాధన చతుష్టయ సంపన్నుడైన వాడు అటువంటి విచారణ చేయటానికి అర్హుడు అని సమాధానం అయితే, సాధన చతుష్టయం అంటే ఏమిటి? ఇవి నాలుగురకాలైన ఉపకరణాలు–సాధనాలు. అవి ఏవంటే.

మొదటిది–నిత్యమైనట్టి, అనిత్యమైనట్టి వస్తువులకు సంబంధించిన వివేకం. (నిత్యానిత్య వివేకం)

రెండవది–ఈ లోకంలోగాని, పరలోకంలోగాని మనం పొందదగినట్టి ఫలముల యెడల విరాగము.

మూడవది–శమము మొదలైన ఆరు సంపదలు.

నాల్గవది–మోక్షం యెడల తీవ్రమైన ఆకాంక్ష.

ఇక ఇప్పుడీ నాల్గు సాధానాలను వివరిస్తున్నారు.

నిత్యానిత్య వస్తువివేకం అంటే ఏమటి? 'బ్రహ్మ సత్యము, ఈ జగత్తు మిథ్య' అనే నిశ్చయాత్మకమైన బుద్ధినే నిత్యానిత్య వివేకం అంటారు.

ఇహాముత్ర ఫలభోగ విరాగము అంటే ఏమిటి? ఈ లోకానికి సంబంధించినట్టి, పరలోకాలకు సంబంధించినట్టి ఫలాల ఎడల (అనుభవాల ఎడల) విరాగం, లేక విముఖత, పూలమాలలు ధరించటం, చందనాదులు అలదుకొనటం, వనితా సంభోగం మొదలైన విషయాల్లో సైతం, కిక్కినకూటి విషయంలోలాగా, మలమూత్రాది విషయంలోలాగా ఇచ్ఛలేకుండా ఉండటం. దీనిని ఇహలోక విరాగం–ఈ లోకానికి సంబంధించిన విరాగం–అంటారు. ఇక బ్రహ్మలోకం, స్వర్గలోకం మొదలైన పరలోకాల్లో రంభ, ఊర్వశి, మేనక మొదలైన అప్సరసల విషయంలో ఇచ్ఛ లేకుండా ఉండటం అనేది అముత్ర విరాగం.

శమదమాది షట్కమును గూర్చి–శమము, దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము. శ్రద్ధ అనే ఈ ఆరు శమదమాది షట్కము. ఇక వీటిని వివరంగా చెప్పుకోవాలంటే

(1) శమము అంటే అంతరింద్రియ నిగ్రహం. అంతరింద్రియం అంటే మనస్సు. ఆ మనస్సును నిగ్రహించుకోవటం శమము. నిగ్రహించుకొవటం అంటే శ్రవణ, మనన నిదిధ్యాసలకు అతిరిక్తమైన విషయాల యెడల (వీటికి మించి ఇతర విషయాల యెడల) నివృత్తి విముఖత. చెవులతో వినటం, విన్నదానిని బాగా చింతన చేయటం. అట్లా బాగా ఆలోచించిన విషయాన్ని నిరంతరం చింతనచేస్తూ ఉండటం అనేవి మానసిక ప్రక్రియలు. వీటికి వ్యతిరేకమైన విషయాల యందు విముఖత కలిగి ఉండటం శమం. లేదా శ్రవణాదుల్లో లీనమైన ఉండటాన్నే శమం అని అనవచ్చు. ఆ శ్రవణంవల్ల ఆరు విధాలైన ఉపక్రమాది తాత్పర్యగ్రాహక సాధనాల ద్వారా వేదాంతానికి అంతకు సంబంధించిన అద్వితీయ వస్తువైన పరమాత్మను గూర్చిన అభిప్రాయాన్ని గ్రహించాలి. ఈ ఉపక్రమాది సాధనాలను గూర్చి తరువాత చెపుతారు.

ఈ పైన చెప్పిన విషయాన్నే మనం విపులంగా చర్చించుకోవాలంటే బంధుమిత్రుల మీద, పతి పత్నీ పుత్రాదులమీద ఉండే ప్రేమ క్షీణించేదే! అవిధంగా నష్టమవటం అనేది ప్రపంచ ధర్మం. ఈ నష్టమవటం. క్షీణించటం అనే ధర్మం అన్నింటికి- సాంసారిక విషయాలన్నింటికి సమంగానే వర్తిస్తుంది. ఏదీ దీనినుండి నష్టమవటం నుండి తప్పించుకోలేదు. ఈ ప్రాపంచిక విషయ వాసనలవల్ల విసిగి వేసారి, మోసపోయి సర్వనాశనమైన పిమ్మట ఆ ప్రాపంచికమైన భ్రమలనుండి తప్పించుకొని, 'బ్రహ్మ సత్యము. జగత్తు మిథ్య' అనే సత్యాన్ని గ్రహిస్తాడు మానవుడు. ఈవిధంగా వైరాగ్య కిరణం అతని హృదయంలో మెరుస్తుంది ఆ మెరుపే, ఆదివ్యరోచిస్సే ఈ జగత్తుకు అతీతమైనట్టి పరమసత్త యొక్క దివ్య ప్రకాశమన్న మాట! అయితే, కేవలం ఈ ప్రపంచానికి సంబంధించిన భోగాలను, విషయవాసనలను వదలినంత మాత్రం చేతనే చాలదు. పారలౌకికమైన-స్వర్గభోగాదుల్ని కూడా వదలిపెట్టాలి. అప్పుడే ఆ పరమసత్యం హృదయంలో ప్రకాశిస్తుంది. కాబట్టి వివేకం, వైరాగ్యం యీ రెండూ కలిగి ఉండి ఇంద్రియ సుఖాభిలాషను వదలిపెట్టటమే ఆ పరమపద ప్రాప్తికి సరియైన మార్గం. పైన చెప్పినట్టి సాధన చతుష్టయ సంపత్తి కలవాడే ఈ మార్గంలో ముందుకు సాగటానికి అర్హుడౌతాడు. వివేక వైరాగ్యాలు రెంటిలోనూ వివేకమనేది అభిజ్ఞత (స్వీయజ్ఞానం) వైరాగ్యమనేది ఇతరమైన వాటివల్ల కలిగినట్టి అనుభూతి. ఈ రెండు శక్తులే మన చిత్తంలో అనేకమైన భావాలను పుట్టిస్తూ ఉంటాయి.

ఇక ఇంద్రియాలంటే ఏమిటి? ఇవన్నీ మన మనస్సుయొక్క వివిధమైన స్థితులు లేక అవస్థలు అని చెప్పుకోవచ్చు. మనం వింటున్నా, మాట్లాడుతున్నా, చూస్తున్నా అన్నీ మనస్సుతో సంబంధం ఉన్నట్టి స్థితులే। వీటిని మనం కర్మేంద్రియాలని, జ్ఞానేంద్రియాలని రెండుగా విభజించుకున్నాం. కర్మేంద్రియాలనేవి మనం చేసే పనులకు కేంద్రాలు. జ్ఞానేంద్రియాలనేవి మనం పొందే అనుభూతులకు కేంద్రాలుగా ఉన్నాయి. వివేకవంతులైనవారు ఈ ఇంద్రియాలను తమ స్వాధీనంలో ఉంచుకుంటారు. అంటే పైన చెప్పుకొన్నట్టి శ్రవణ మనన నిదిధ్యాసలనే ప్రక్రియల ద్వారా శమాన్ని- అంతరింద్రియ నిగ్రహం కలిగి ఉంటారన్న మాట. అంతరింద్రియం అంటే మనస్సు గదా! ఈ ఇంద్రియాలన్నీ మనస్సుకు వశమై ఉంటాయి. కాబట్టి ఆ మనస్సును మనం నిగ్రహిస్తే ఇంద్రియాలన్నీ నిగ్రహింపబడతాయి అని భావం ఈవిధంగా శ్రవణమననాదులతో ఇంద్రియాలను స్వాధీనం చేసుకున్నప్పుడు ఒకవిధమైన ఆనందానుభూతి కలుగుతుంది. తరువాతది వైరాగ్యశక్తిని సంపాదించటం. సత్త్వరజస్తమోగుణాల యెడల కూడా తన ఆసక్తిని వదలివేసినప్పుడే ఈ వైరాగ్యశక్తి బాగా అభివృద్ధి చెందుతుంది. సామాన్య మానవులు లౌకిక భోగాలవైపు ఆకర్షితులౌతు ఉంటారు. వైరాగ్యశక్తి ఉన్నవారు లౌకిక భోగాల యెడల విముఖులై ఉంటారు. అంటే, సమస్త ఇంద్రియాలు. వాటి విషయాలు మానవుని వశంలో ఉండాలే తప్ప మానవుడు వాటి వశంలో ఉండకూడదు. మానవుడు అంటే జీవాత్మ అని భావం. అట్లా ఇంద్రియాలకు, వాటి భోగాల యెడల ఉండే ఆసక్తికి అతీతమైనట్టి స్థితియే వైరాగ్యం. అటువంటి వైరాగ్యమే మోక్షమార్గంలో ముందుకు సాగటానికి దారిబత్తెంలాగా (పాథేయం) ఉపయోగపడుతుంది.

పైన చెప్పిన శ్రవణాదుల ద్వారా మనం అద్వితీయమైనట్టి పరమాత్మకు సంబంధించిన తాత్పర్యాన్ని గ్రహించాలి. ఈ విధమైన అవగాహన కలగటానికి ఉపక్రమాది తాత్పర్యగ్రాహక సాధనాలను చెప్పారు. ఇవి ఆరు భాగాలుగా – విధాలుగా ఉన్నాయి.

## 13

*షడ్విధ లింగాని తు ఉపక్రమోపసంహారాభ్యాస ఫలాపూర్వతార్థ వాదోపపత్త్యాఖ్యాని। ప్రకరణ ప్రతిపాద్య స్యార్థస్య తదాద్యన్తయోరుప పాదన ముపక్రమోపసంహారౌ। యథా చాందోగ్యే షష్ఠాధ్యాయే ప్రకరణ ప్రతి పాద్యస్యా ద్వితీయవస్తునః ఏకమేవాద్వితీయ*

*మిత్యాదౌ ఏతదాత్మ్య మిత్యన్తే చ ప్రతిపాదనం। ఫలన్తు ప్రకరణ ప్రతిపాద్యస్యాత్మజ్ఞానస్య తదనుష్ఠానస్య వాతత్ర శ్రూయమాణం ప్రయోజనమ్। యాథా తత్ర తత్ర ఆచార్యవాన్పురుషో వేద తస్య తావదేవ చిరం యావన్న విమోక్ష్యే అథ సమ్పత్స్యే ఇతి అద్వితీయమస్తుజ్ఞానస్య తత్ప్రాప్తిః ప్రయోజనం ఫలం శ్రూయతే। అపూర్వతాతు ప్రకరణ ప్రతిపాద్యస్యాద్వితీయవస్తునః ప్రమాణాన్తరా విషయీకరణమ్॥*

తాత్పర్యగ్రాహక సాధనాలను లింగములంటారని చెప్పుకున్నాం గదా! అవి ఆరు విధాలుగా ఉంటాయి. (1) ఉపక్రమము (2) ఉపసంహారము (3) అభ్యాస ఫలము (4) అపూర్వత (5) అర్థవాదము (6) ఉపపత్తి; అనేవి. ఉపక్రమము అంటే ప్రతిపాదింపదలచిన విషయాన్ని ఆరంభించటం. ఉపసంహారము అంటే ప్రతిపాదింపదలచిన విషయం యొక్క అంతము – చివరి భాగము. వీటికి ఉదాహరణగా ఛాందోగ్యోపనిషత్తులోని ఆరవ ఆధ్యాయాన్ని చెపుతున్నారు. ఆ అధ్యాయంలో (ప్రకరణంలో) ప్రతిపాదింపదలచిన విషయం అద్వీతీయ వస్తువును గూర్చి నిర్విశేష బ్రహ్మ యొక్క తత్వాన్ని గూర్చి–ఆత్మ పరమాత్మలయొక్క అభేదాన్ని గూర్చి, ఆరుణి తన కుమారుడైన శ్వేత కేతువుకు ఆత్మ తత్వాన్ని భోధించటం జగత్స్వరూప వర్ణనం, సృష్టిక్రమవర్ణం, షోడశ కలాపురుష వర్ణనం, అవస్థాత్రయంలో పురుషుని స్థితిని వర్ణించే ప్రకరణాన్ని ఉపక్రమించారు – ఆరంభించారు. ఇట్లా చెప్పి అనేక ఉదాహరణలు ఇచ్చి ఇచ్చి 'ఇటువంటి గుణాలతో కూడిన' గుణాలతో కూడిన' అంటూ చివరలో ఆ సత్యాన్ని (చెప్పదలచిన అద్వితీయ వస్తువు) ప్రతిపాదించి, ఆ ప్రకరణాన్ని ముగించారు. ఇది ఉపసంహరం. ఈ ఉపక్రమానికి, ఉపసంహరానికి (అదికి అంతానికి) మధ్యలో ఆ ప్రకరణంలో చెప్పదలచిన విషయాన్ని అనేకసార్లు, మాటి మాటికి ప్రతిపాదించటానిక్న– చెప్పటాన్ని అభ్యాసఫలము అంటారు. లేదా అభాస్యం, ఆవృత్తి అని అన్నా అనవచ్చు. పైన చెప్పిన చాందోగ్య ప్రకరణంలోనే ఆ చెప్పదలచినట్టి నిర్విశేష పరబ్రహ్మను గూర్చి, అద్వితీయ వస్తువును గూర్చి అనేకసార్లు, అనేక ఉదాహరణలతో చెప్పారు. ఆ విషయాన్నే తొమ్మిది విధాలుగా ప్రతిపాదించారు. ఇదంతా ఆవృత్తి అభ్యాస ఫలం. ఇక నాల్గవదైన అపూర్వత అనేది. ఈ చాందోగ్య ప్రకరణంలోనే 'ఆ అద్వితీయ

వస్తువును' గురించి చెపుతూనే మధ్యలో 'తత్త్వమసి' అనే క్రొత్తవిషయాన్ని ప్రతిపాదించారు. ఆ సత్యాత్మను గూర్చి, ఆత్మ పరమాత్మల అభేదాన్ని గూర్చి చెపుతూనే 'ఓ శ్వేతకేతూ! అదే సత్యం, అదే ఆత్మ, అదే నీవు (తత్త్వమసి)' అని చెప్పారు. ఈవిధంగా ప్రకరణం మధ్యలో ఒక క్రొత్త విషయాన్ని ప్రతిపాదించటాన్ని 'అపూర్వత' అంటారు. ఈ 'తత్త్వమసి' అనేది లోగడ చెప్పని విషయం. ఇట్లా చెప్పటం వల్ల ఆ ప్రకరణంలో చెప్పదలచినట్టి ఆత్మజ్ఞానం యొక్క లేదా ఆత్మానుష్ఠానం యొక్క ప్రయోజనం సిద్ధిస్తోంది. అక్కడక్కడ 'ఆచార్యులైనవారికి తెలుసు. వారీ విధంగానే చెప్పారు' అనే మాటల స్థాయిత్వం ముక్తి లభించేటంత వరకే. ఈవిధంగా ఆ అద్వితీయ వస్తువును గురించిన జ్ఞానము, దానిని పొందటంవల్ల కలిగే ప్రయోజనం– ఫలము చెప్పబడుతోంది. చెప్పదలచినట్టి ప్రకరణం మధ్యలోనే 'అపూర్వత' అనేది విషయీకృతమైనది. (ఈ ఆరువిధాలైన తాత్పర్యాన్ని గ్రహించే సాధనాలు, శ్రవణమనవాదుల కుపకరించే సాధనాలుగా గుర్తుంచుకోవాలి. అంటే విషయాన్ని విని అర్థం చేసుకునేందుకు ఉపయోగించే సాధనాలు) ఇంతవరకు నాలుగు సాధనాలను గూర్చి చెప్పారు. మిగతావాటిని తరువాత చెపుతారు.

## 14

*యథా తత్రైవా ద్వితీయ వస్తునో మానాస్తరావిషయీకరణమ్।*
*ప్రకరణ ప్రతిపాద్యస్య తత్ర తత్ర ప్రశంసన మర్థవాదః। యథా*
*అత్రో తతమాదేశమప్రాక్ష్యః యేనా శ్రుతం శ్రుతం భవతి అమతం*
*మతం అవిజ్ఞాతం విజ్ఞాతమితి అద్వితీయవస్తు ప్రశంసనం॥*

ఇపుడు అర్థవాదమనే తాత్పర్య గ్రాహకసాధనాన్ని గూర్చి చెపుతున్నారు. విధివాక్యాలనుగాని, నిషేధవాక్యాలనుగాని బలపరచి బోధించటం కోసం నిందారూపంగా గాని, స్తుతిరూపంగాగాని వివరించటాన్ని 'అర్థవాదము' అంటారు. లేదా స్తుతిగాని, నిందగాని ప్రయోజనంగా గల లౌకిక వాక్యాన్ని కూడా అర్థవాదము అంటారు. ఆయా ప్రకరణాల్లో ప్రతిపాదింపదలచిన విషయాన్ని ప్రశంసించటం అర్థవాదమంటారు. దీనికి ఉదాహరణగా పైన చెప్పిన ఛాందోగ్యంలోనే ఆ అద్వితీయ వస్తువును గూర్చి (నిర్విశేషబ్రహ్మను గూర్చి) చెప్పే సందర్భంలో 'దేనివల్ల వర్ణింపబడిన వస్తువును గూర్చిన జ్ఞానం కలుగుతుందో, దేనివల్ల అనుభూతికి రాని విషయం కూడా అనుభూతమౌతుందో, దేనివల్ల అజ్ఞాతంగా

ఉండే పరమాత్మ కూడా తెలిసినవాడౌతాడో" అంటూ ఆ అద్వితీయ పదార్థాన్ని గూర్చిన ప్రశంస ఉంది. ఈ విధమైన ప్రశంసను అర్ధవాదము అంటారు.

## 15

*ప్రకరణప్రతిపాద్యార్థసాధనే తత్ర శ్రూయమాణా యక్తిరుపపత్తిః యథా తత్ర సౌమ్యైకేన మృత్పిండేన సర్వం మృణ్మయం విజ్ఞాతం స్యాద్వాచారమ్భణం వికారో నామధేయం మృత్తి కేత్యేవ సత్యమిత్యాదౌ అద్వితీయ వస్తుసాధనే వికారస్య వాచారంభణ మాత్రత్వే యుక్తిః శ్రూయతే॥*

ప్రకరణం యొక్క తాత్పర్యాన్ని గ్రహించటానికి ఉపకరించే సాధనాల్లో ఆరవది (చివరిది) అయిన 'ఉపపత్తి'ని గూర్చి చెపుతున్నారు. ఈ ఉపపత్తినే 'యుక్తి' అని కూడా అంటారు. ఆయా ప్రకరణాల్లో చెప్పదలచిన విషయం యొక్క అర్థాన్ని సాధించటం కోసం తర్కపూర్ణమైనట్టి యుక్తుల ద్వారా విశదీకరిస్తారు. దానినే ఉపపత్తి అని అంటారు. పైన చెప్పిన ఛాందోగ్యంలోనే, ఆ అద్వితీయవస్తు ప్రశంస చేసే సందర్భంలో, ఆ సత్యబ్రహ్మను నిరూపణ చేయటం కోసం " ఓ ప్రియదర్శనుడా? ఒక మట్టిబెడ్డను చూచి మృత్తికతో తయారయ్యే సమస్త కార్యజాతాన్ని- వస్తువులను మనం ఊహించవచ్చు. పేర్లలో మాత్రమే కుండ, దాక, చట్టి, బాన అనే భేదాలు తప్ప మట్టి అనేది ఒకటే సత్యం" అంటూ ఇంకా ఇటువంటి అనేక యుక్తుల ద్వారా తాము చెప్పదలచిన సత్యబ్రహ్మను గూర్చి తార్కికమైన యుక్తుల ద్వారా విషయాన్ని చెపుతున్నారు. ఇట్లా చెప్పటాన్నే 'ఉపపత్తి' అంటారు.

ఈ విధమైనట్టి పైన చెప్పిన ఆరు సాధనాల ద్వారా తాను వినిన విషయం యొక్క తాత్పర్యాన్ని గ్రహించాలి. ఆ విధంగా గ్రహించిన దానిని మననం చేయాలి అని చెపుతూ ఈ షడ్విధ లింగాలను విశదీకరించారు. ఆ విషయం మనకు అర్థం అయినంతనే ఈ లింగాలు (జ్ఞాపకాలు-లేదా? గుర్తులు) అన్నీ హటిలోనే ఆ విషయంలోనే లయమై పోతాయి-ఎట్లా? మన ఇంద్రియాలు, మనస్సు, బుద్ధి, అహంకారం అన్నీ తన్మాత్రలలో (శబ్ద స్పర్శ రూప రస గంధాదుల్లో) లీనమై పోయినట్లు! ఇంతవరకు చెప్పినదంతా 'శ్రవణ' మనే విషయాన్ని విపులికరించటానికే! శ్రవణమంటే కేవలం వినటమే కాదు-ఆ వినిన

దానిలోని తాత్పర్యాన్ని ఈ ఆరు సాధనాల ద్వారా గ్రహించాలి, అని భావం.

తరువాత 'మననం' అనే విషయాన్ని గూర్చి చెపుతారు.

## 16

*మననస్తు శ్రుతస్యాద్వితీయ వస్తునో వేదాంతార్థాను గుణయుక్తి భిరనవరత మనుచింతనం। విజాతీయ దేహాది ప్రత్యయరహి తాద్వి జాతీయవస్తు జాతీయప్రవాహో నిది ధ్యాసనమ్। అస్యార్థ। విజాతీయ దేహాది బుధ్యన్త జడపదార్థా నిరాకరణేన సజాతీయాద్వితీయ వస్తు విషయ ప్రత్యయ ప్రవాహీకరణం నిది ధ్యసన మిత్యర్థః॥*

గహనంగా చింతనం చేయటాన్ని మననం అంటారు. దేనిని గూర్చి గహనంగా చింనత చేయాలి? మనం విని ఉన్నట్టి, పరమాత్మకు సంబంధించినట్టి వేదాంత విషయంయొక్క అర్థాన్ని– తాత్పర్యాన్ని, దానికి అనుగుణమైనట్టి యుక్తుల ద్వారా నిరంతరం గంభీరంగా ఆలోచన చేస్తూ, ఉండటమే మననం. తాత్పర్యాన్ని గ్రహించటాన్ని గూర్చి పైన పెప్పారు. గదా! మనం పరమాత్మను గురించిన కొన్ని విషయాలు విన్నాం. వాటి తాత్పర్యాన్ని బాగా గ్రహించాం. ఆ వేదాంత విషయాలలోని పరమార్థానికి అనుగుణమైన వేరు వేరు యుక్తుల ద్వారా (తార్కికంగా) ఎల్లప్పుడు గంభీరంగా ఆలోచిస్తూ వుండాలని భావం. దానినే మననం అంటారు. ఒకే జాతికి చెందిన వాటిని సజాతీయాలని వేరు జాతులకు చెందిన వాటిని విజాతీయాలని అంటారు. జాతి అంటే తెగ అన్నమాట. ఆత్మ, పరమాత్మ ఇవి రెండూ సజాతీయాలు, ఆత్మకు ఇంద్రియాలు, శరీరం, ఈ ప్రాపంచిక విషయాలు ఇవన్నీ విజాతీయాలు, ఆత్మకు ఈ దేహాదులన్నీ విజాతీయాలు గదా! ఆ విజాతీయమైన దేహాదుల్లో మనకు నమ్మకంపోయింది–అవిశ్వాసం కలిగింది. ఎట్లా కలిగింది? శ్రవణంవల్ల! అంటే వేదాంతార్థాలను విని ఉండటంవల్ల! ఆ విధంగా మనకు దేహాదుల్లో కలిగిన అవిశ్వసంవల్ల ఆవిజాతీయమైన వస్తువుల్లో సజాతీయమైన విశ్వాసాన్ని ప్రవహింప చేయటమే 'నిది ధ్యాసనం' అని పిలవబడుతోంది. అంటే ఈ శరీరాదులు, ఈ భౌతిక జీవనానికి సంబంధించిన విషయాలన్నీ కూడా ఆత్మకు విజాతీయాలే! ఆ విజాతీయమైన విషయాలన్నీ

అస్థిరం, అశాశ్వతం కాబట్టి వాటియందు ఇంతకు పూర్వమున్న విశ్వాసాన్ని తొలగించుకోవాలి. పరమాత్మ సజాతీయం కాబట్టి ఆ సజాతీయమైన పరమాత్మ యందు విశ్వాసాన్ని పెంపొందించుకోవాలి. ఆ విశ్వాసం ఎల్లప్పుడు ఉండేటట్టు చూచుకోవాలి అని చెప్పటానికే సజాతీయమైన విశ్వాసాన్ని 'ప్రవహింప చేయాలి' అన్నారు. దేహాది బుద్ధిపర్యంతం గల జడపదార్థాలను విరాకరించి, ఆత్మ సజాతీయమైన పరమాత్మ విషయంలో విశ్వాసాన్ని ప్రవహింప చేసుకోవటాన్ని నిది ధ్యాసనం అంటారని భావం. ఇంతవరకు 'శమము' అనే దానిని గురించి చెప్పారు. ఇక దమము, ఉపరతి, తితిక్ష, సమాధానము, శ్రద్ధ అనే వాటిని వివరిస్తారు.

## 17

*దమో నామ బాహ్యేంద్రియ నిగ్రహః బాహ్యేంద్రియాణి కాని? కర్మేంద్రియాణి పంచ జ్ఞానేంద్రియాణి పంచ। తేషాం నిగ్రహః శ్రవణాది వ్యతిరిక్త విషయేభ్యో నివృత్తిర్దమః ఉపరతిర్నామ విహితానాం కర్మణాం విధినాపరిత్యగః। శ్రవనాదిష్వేవ వర్తమానస్య మనసః శ్రవణాదౌ వర్తమానం ఉపరతిః తితిక్షా నామ దేహ విచ్ఛేద వ్యతిరిక్తం శీతోష్ణాది ద్వంద్వ సహనమ్। నిగ్రహ- శక్తావపి పరాపరాధ సోఢృత్వం వా తితిక్షా। సమాధానం నామ, శ్రవణాదిషు వర్తమానం మనో వాసనావశాద్విష యేషు యదా యాదా గచ్ఛతి తాదా దోషదృష్ట్వా తేషు తేషు శ్రవణాదిషు సమాధిః సమాధానమ్॥*

దమము అంటే బాహ్యేంద్రియ నిగ్రహం. బాహ్యేంద్రియాలంటే ఏవి? కర్మేంద్రియాలే అయిదు, జ్ఞానేంద్రియాలు అయిదు. కర్మేంద్రియాలు, పని చేసేందుకు ఉపయోగపడే నోరు, చేతులు, కాళ్ళు, విసర్జనేంద్రియం, జననేంద్రియం (వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ). జ్ఞానేంద్రియాలు– చెవులు, చర్మం కండ్లు, నాలుక, ముక్కు, (శబ్ధ, స్పర్శ, రూప, రస, గంధములు). ఈ పది బాహ్యేంద్రియాలు. వీటి నుండి–ఈ ఇంద్రియా విషాయాల నుండి నివృత్తి పొందటాన్ని దమము అంటారు. విహితమైన కర్మలను విధిపూర్వకంగా పరిత్యజించటాన్ని లేదా ఉపేక్షించటాన్ని 'ఉపరతి' అంటారు. ఉపరతి అంటే విరక్తి. విహితమైన

కర్మలు అంటే శ్రోత్రేంద్రియాదుల్లో లేదా బ్రహ్మను గూర్చిన శ్రవణ మననాదుల్లో లగ్నమైయున్న మనస్సును సైతం ఒక పద్ధతి ప్రకారం ఉపేక్షించటం 'ఉపరతి'. శరీరవియోగానికి భిన్నమైనట్టి శీతోష్ణాణ కష్టాలను సహించే శక్కిని 'తితిక్ష' అంటారు. లేదా, తనకు నిగ్రహించగలిగినట్టి శక్తి, ఎదుర్కో గలిగినట్టి శక్తి ఉండి కూడా ఇతరులు చేసిన అపరాధాను, అపకారాలను సహించగలిగే శక్తిని 'తితిక్ష' అటారు. శరీరాన్ని వదిలేటప్పుడు కలిగే కష్టం, లేదా ఏ ఆత్మహత్యో చేసుకునేటప్పుడు కలిగే కష్టాన్ని సహించే శక్తిని తితిక్ష అనరు. శీతోష్ణాది ప్రకృతి శక్తులను, ఇతర భౌతిక కష్టాలను సహించే శక్తిని తితిక్ష అంటారు. అట్లాగే తనకంటె బలవంతుని ఎదుర్కోలేనప్పుడు చూపించే సాహసం కూడా తితిక్ష అనిపించుకోదు. ఇక సమాధానము లేక సమాధిని గురించి–శ్రోత్రేంద్రియాదుల్లో లగ్నమైన ఉండే మనస్సు (అంటే, బ్రహ్మవిషయకమైన వేదాంత విషాలు వింటూ ఉండే మనస్సు) ఒక్కొక్కప్పుడు వాసనావశమైన (సూక్షసంస్కారానికిలోనై) విషాయాల వైపుకుపోతుంది. అంటే రూప రసాదులవైపుకు పోతుంది. అప్పుడు ఏకాదశేంద్రియాలను (కర్మ జ్ఞానేంద్రియాలతో కూడిన మనస్సును) ఆ రూప రసాది విషయాదులు దోషభూయిష్టాలని తలచి వాటిని గ్రహించి ఆ విన్నటు వంటి వేదాంత వాక్యాల్లో భావచింతనం చేయాటాన్ని 'సమాధి' అంటారు దీనినే సమాధానం అని, ఏకాగ్రీకరణం అని అనవచ్చు. మనం వేదాంత విషయాలను గూర్చిన శ్రవణ మననాదులు చేసేటప్పుడు కూడా మన మనస్సు చలించి విషయావాసనల వైపుకు పోతుంది ఎందుచేత? వాసనావశమై అంటే సూక్ష్మసంస్కారానికిలోనై. ఆ సమయంలో ఆ విషయ వాసనలు దోషములనే దృష్టితో మనస్సును మరల్చి మనం విని ఉన్నట్టి వేదాంత వాక్యాల్లో 'అహంబ్రహ్మాస్మిసో హం' ఇటువంటి వేదాంత వాక్యాల్లో మనస్సును లగ్నంచేసి ఆ వాక్య భావాల్ని చింతనం చేయాటాన్ని 'సమాధి' అంటారు.

## 18

*శ్రద్ధా నామ, గురువేదాంత వాక్యేషు అతీవ విశ్వాసః॥*

గురువు చెప్పిన మాటల్లోను, వేదాంత వాక్యాల విషయంలోను ఉండే అత్యంతమైన విశ్వాసాన్ని శ్రద్ధ అంటారు. ఈ శ్రద్ధ అనేది అచార్యునియందు ఉండాలి. ఉపనిషద్వాక్యాల్లోనూ ఉండాలి.

## 19

*ఇదం తావత్ శమాదిషట్కమిత్యుక్తమ్ । ముముక్షుత్వం నామ । మోక్షేఽ తి తీవ్రేచ్ఛావత్త్వమ్ । ఏతత్సాధన చతుష్టయ సంపత్తిః, తద్వాన్ సాధన చతుష్టయ సంపన్నః । తస్య ఆత్మానాత్మ విచారేఽ ధికారః యథా బ్రహ్మచారిణః కర్తవ్యంతరం నాస్తి, తథాస్యాన్యత్ కర్తవ్యం నాస్తి ॥*

ఇంతవరకు శమాదిషట్కాన్ని వివరించటం జరిగింది. (శమము, దమము, ఉపరతి, తితిక్షా, సమాధానము, శ్రద్ధ అనేవి శమాదిషట్కాలని లోగడ చెప్పారు.)ఇక తరువాతి విషయం ముముక్షుత్వం. మోక్షం పొందాలనే తీవ్రమైనట్టి ఉత్కంఠను కలిగి ఉండటాన్ని ముముక్షుత్వం. అంటారు. ఈ ముముక్షుత్వమనేది లోగడ చెప్పిన సాధన చతుష్టయంలో నాల్గవది- చివరిది. ఈ సాధన చతుష్టయాన్ని 12వ సూత్రంలో చెప్పారు. అటువంటి సాధన సంపత్తి కలవానికే ఆత్మానాత్మ విచారణచేసే అధికారం ఉంటుంది. బ్రహ్మచారులకు-అంటే, ఎల్లప్పుడు బ్రహ్మయందు చరిస్తూ ఉండే బ్రహ్మ జ్ఞానసంపన్నులకు ఇతర కర్తవ్యాలు ఏమీ లేనట్లే ఈ సాధన చతుష్టయసంపన్నునికి కూడా ఇతర కర్తవ్యాలేమీ ఉండవు బ్రహ్మజ్ఞానానికి, మామూలు సంసారుల్లాగా చేయవలసిన కర్మలంటూ ఏమీ ఉండవు. అట్లాగే ఈ సాధన చతుష్టయ సంపన్నుడు కుడా నిర్వర్తించాల్సిన కర్తవ్యాలేమీ ఉండవు అని భావం ఎందుచేత? ఈ నాల్గువిధాలైన సాధనములతో కూడిన ముమక్షువు యొక్క స్థితి, బ్రహ్మయందు చరించే బ్రహ్మనిష్ఠుని స్థితి, ఒకటిగానే ఉంటుంది కాబట్టి.

## 20

*సాధన చతుష్టయ సమ్పత్త్యభావేఽ పి గృహస్థానా మాత్మవిచారే క్రియమాణే సతి తేన ప్రత్యవాయో నాస్తి, కింతు అతీవ శ్రేయో భవతి। యథా-*

*దినే దినే చ వేదా న్తవిచారాద్ భక్తిసంయుతాత్ ।*
*గురు శుశ్రూషయా లబ్ధాత్ కృచ్ఛ్రాశీతిఫలం భవేత్॥ ఇత్యుక్తమ్.*

పైన వివరించినట్టి సాధన చతుష్టయ సంపత్తి లేనివారైనట్టి గృహస్థులు కూడా ఆత్మవిచారణ చేయవచ్చు. ఆత్మవిచారణమనేది కేవలం సన్న్యాసులకు మాత్రమే ఉద్దేశించినది

కాదు అని భావం గృహస్థులు ఆ విధంగా ఆత్మానాత్మ విచారణ చేసినందువల్ల వారికి ఎటువంటి పాపము అంటదు. పైగా ఆ విధమైన ఆత్మవిచారణ చేసినందువల్ల వారికి శ్రేయస్సే కలుగుతుంది.

ఈ విషయమై ఈ దిగువ విధంగా చెప్పబడ్డది-ప్రతిరోజూ వేదాంత విచారణ చేయటంవల్ల, భక్తితో కూడియున్నందువల్ల, గురు శుశ్రూష చేయటంవల్ల ఎనభై కృచ్ఛ్రవ్రతాలవల్ల కలిగే ఫలం లభిస్తుంది. సాంతపన వ్రతం మొదలుగా గల ఎనభై రకాల ప్రాయశ్చిత్త కర్మలవల్ల లభించే ఫలం (పుణ్యం) లభిస్తుందని భావం. ఆత్మవిచారణకు సంసారులు సైతం అర్హులని చెప్పారు.

## 21

*ఆత్మానాత్మ విచారః కర్తవ్య ఇత్యుక్తమ్. ఆత్మా నామ స్థూల సూక్ష్మకారణ శరీరత్రయ విలక్షణః పంచకోశ వ్యతిరిక్తః అవస్థాత్రయ సాక్షీ సచ్చిదానంద స్వరూపః*

అందుచేతనే-గృహస్థులకు కూడా ఆత్మానాత్మవివేకం కర్తవ్యమని చెప్పారు.ఇక ఇప్పుడు ఆత్మకు నిర్వచనం ఇస్తున్నారు. ఆత్మ అంటే ఏమిటి? అది ఎటువంటిది? స్థూల, సూక్ష్మ, కారణ శరీరాలకంటే విలక్షణమైనది, పంచకోశాలకు (అన్నమయ, ప్రాణమయ, మనోమయ, విజ్ఞానమయ, ఆనందమయ (కోశాలు) వ్యతిరిక్తమైనట్టిది, జాగ్రత్ స్వప్న సుషుప్త్య వ్యవస్థలలో సాక్షాత్తు ద్రష్టగా ఉండేటటువంటి సచ్చిదానంద స్వరూపమే ఆత్మ.

సచ్చిదానంద ఘన స్వరూపమైన ఆత్మ అనేది మూడు శరీరాలకు, అయదు కోశాలకు భిన్నమైనది. జాగ్రత్ స్వప్న సుషుప్తులనే మూడు అవస్థలలోను కూడా ద్రష్టగా ఉంటుంది.

## 22

*అనాత్మా నామ అనృత జడ దుఃఖాత్మకం సమష్టి వ్యష్ట్యాత్మక శరీర్తయమ్. శరీరత్రయం నామ స్థూలసూక్ష్మ కారణశరీర త్రయమ్, స్థూలశరీరం నామ పంచీకృతభూత కార్యం కర్మజన్యం జన్మాదిషడ్భావ వికారమ్.*

ఆత్మ అనాత్మలను గూర్చిన విచారణ కర్తవ్యమని చెప్పారు. తరువాత ఆత్మ అంటే ఏమిటో నిర్వచనం పైన ఇచ్చారు. ఇక అనాత్మ అంటే ఏమిటో చెపుతున్నారు – అనాత్మ అనేది అనృతం, జడం, దుఃఖాత్మకమైనది. సమష్టి వ్యష్టి స్వరూపమైనట్టి మూడు విధాలైన శరీరాలు అనాత్మయే! మూడు శరీరాలు అంటే, స్థూల సూక్ష్మ, కారణశరీరాలు. ఈ మూడూ అనాత్మయే! స్థూల శరీరము అంటే పంచీకృతమైన భూతకార్యము– పంచకోశములతో చేయబడిన భౌతిక కార్యము కర్మవలన పుట్టినది. శరీర పరిగ్రహమనేది కర్మ వల్ల జరుగుతోందని వెనుక 4వ సూత్రంలో చెప్పారు. జన్మమరణాది ఆరు విధాలైన భావాలతో వికృతమైనది– కూడినది.

## 23

*తథా చోక్తమ్ -*

*పంచీకృత మహభూత సంభవం కర్మసంచితమ్ ।*

*శరీరం సుఖదుఃఖానాం భోగాయతన ముచ్యతే । ఇతి ॥*

అందుకే అన్నారు –

ఈ శరీరము, పంచీకృతమైన మహభూతములనుండి పుట్టినది – భూమి, నీరు, తేజస్సు, వాయువు, ఆకాశము అనే ఐదు మహభూతముల కలయికవల్ల పుట్టినది – ఆ మూల తత్వాలవల్ల పుట్టినది. అని భావం. ఇంకా కర్మవల్ల పుట్టినది. అంటే, మనం జన్మ జన్మాంతరాలలో చేసుకొన్న కర్మలయొక్క (సంచిత కర్మలయొక్క) ఫలితాలైన సుఖదుఃఖాలను అనుభవించటం కోసం మనకు ఈ శరీరం లభించింది అని. ఈ సంచిత కర్మల ఫలితాలను (సుఖదుఃఖాలను) అనుభవించటానికి ఈ శరీరమే స్థాపనం. ఈ శరీరంతోనే ఆ సుఖాన్నిగాని, దుఃఖాన్నిగాని అనుభవిస్తాము.

## 24

*పంచీ కరణస్తు-*

*ద్విధా విధాయ చైకైకం చతుర్ధాప్రథమం పునః ।స్వస్వేతర*

*ద్వితీయాంశైర్యోజనాత్ పంచ పంచ తే । ఇతి ॥*

పృథివ్యాపస్తేజో వాయురాకాశాలు పంచమహాభూతాలు. వీటి ప్రథమ సూక్ష్మాంశాలు తన్మాత్రలు. అంటే శబ్ద స్పర్శ రూప రస గంధాలు. పంచ తత్త్వాల సమ్మేళనాన్ని ముందు రెండు భాగాలుగా విభజించాలి. ఆ తువాత ఒక్కొక్క భాగం నాల్గేసి ఖండాలుగా విభజింపబడుతుంది. (అంటే ఒక్కొక్క తత్త్వం ఎనిమిది భాగాలు అవుతోంది.) అప్పుడు తనకు భిన్నమైనట్టి ఇతర భాగాలతో కలిపినప్పుడు అవి ఐదేసి అవుతాయి.

ఉదా॥ పృథివి అనే తత్త్వాన్ని తీసికొని రెండు భాగాబిలు చేశాము. 1/2+1/2 తరువాత ఒక్కొక్క సగాన్ని నాల్గు భాగాలు చేశాము. 1/8 అయినది. ఇట్లా అన్ని తత్త్వాలను విభజించాము.

అప్పుడు పృథివి అనే భూతంలోని అర్ధభాగాన్ని గ్రహించి, మిగిలిన నాలుగు - ఆపస్తేజోవాయురాకాశాలలోని ఎనిమిదవ భాగాన్ని గ్రహించగా పృథివి పంచీకృతమైనది అన్నమాట.

అట్లాగే ఆపన్ (జలమనే భూతం) లోని అర్ధభాగాన్ని గ్రహించి, దానిని పృథివ్యాది మిగతా నాలుగు భూతాలయొక్క ఎనిమిదవ భాగాన్ని కలుపగా జలమనే భూతం పంచీకృతమౌతుంది. ఇదేవిధంగా మిగతావి కూడా గ్రహించాలి. (పంచీకృతమయ్యే తత్త్వం 1/2 భాగం మిగతా తత్త్వాలలోని 1/8 భాగం కలపాలి.) ఈ శరీర నిర్మాణము, సృష్టికార్యము జరిగిన తీరును వివరించటానికి ఈ ప్రక్రియను చెప్పారు. వేదాంతశాస్త్రంలో ఇది ప్రత్యేక ప్రకరణ గ్రంథంగా ప్రశస్తి పొందింది (పంచీకరణమనేది.)

*శీర్యతే వయోభిర్బాల్య కౌమార యౌవన వార్ధక్యాదిభి రితి శరీరమ్. దహ భస్మీకరణే ఇతి వ్యుత్పత్త్యా చ దేహః భస్మీభావం ప్రాప్నోతి నను కేచిద్దేహ న భస్మీ భావం ప్రాప్నువంతి, కేచిద్దేహః ఖననాది ప్రాప్నువన్తి, కథముచ్యతే సర్వం స్థూలాదికం స్థూల దేహజాతం భస్మీ భావం ప్రాప్నోతి, యద్యప్యేవం తథాపి కేనాగ్నినా దాహత్వం సంభవతీత్యత అహ, సర్వేషాం స్థూలదేహనామ్ ఆధ్యాత్మి కాధిభౌతికాధిదైవికాదీ - తాపత్రయాగ్నీ నా దాహత్వం సంభవతి, ఆధ్యాత్మికం నామ ఆత్మానం దేహం అధికృత్యవర్తత*

*ఇత్యధ్యాత్మమ్. అధ్యాత్మికం నామ ఆత్మానం దేహం అధికృత్యవర్తత ఇత్యధ్యాత్మమ్. అధ్యాత్మంచ తత్ దుఃఖం ఆధ్యాత్మికం వాతపిత్తక ఫజాతమ్ శిరోరోగ జ్వరాదినా వ్యాధి రూపమ్ అధిభౌతికం నామభూతమధి కృత్య వర్తతే ఇత్యాధిభౌతికమ్ వ్యాఘ్రతస్క రాదిజన్య దుఃఖమ్, అధిదైవికం నామ దేవమధికృత్య వర్తతే ఇత్యాధిదైవిక శీతాతపవాతవర్ష వైద్యుత్యాది దుఃఖమ్.*

బాల్య, కౌమార, యౌవన, వార్ధక్యాది వయస్సుకు చెందినట్టి దశలద్వారా ఈ శరీరం క్షీణమౌతుంది. (శీర్యతే = జీర్ణమౌతుంది కాబట్టి శరీరం అన్నారు.) అట్లాగే 'దహభస్మీకరణే' అనే వ్యుత్పత్తి ననుసరించి భస్మమౌతుంది. దహింపబడుతుంది. కాబట్టి దానికి దేహమనే పేరు వచ్చింది. అయితే ఈ విషయంలో ఒక సందేహం కలగవచ్చు. ఏమని? అన్ని దేహాలు దహింపబడటం లేదు గదా! కొన్నింటిని పాతిపెడుతున్నారు గదా! అటువంటప్పుడు అన్నిటికి దేహమనే పదం ఎట్లా సరిపోతుంది? అంటే స్థూలాదికాలను – స్థూలదేహమనే పదం ఎట్లా సరిపోతుంది? అంటే స్థూలాదికాలను – స్థూలదేహంతో పుట్టిన తత్త్వాలు దహింపబడుతున్నాయని అనటం ఎట్లా సమంజసమౌతుంది? అని. దీనికి సమాధానం చెపుతున్నారు – స్థూలదేహాలన్నీ దైహిక (ఆధ్యాత్మిక) దైవిక, భౌతిక తాపాలతో (తాపత్రయాలతో) తగులబడుతూండటం సంభవమేగదా! ఆత్మకు దేహానికి సంబంధించినది ఆధ్యాత్మికం. ఈ ఆధ్యాత్మికానికి సంబంధించిన దుఃఖాలను, తాపాలను ఆధ్యాత్మికతాపాలంటారు – వాతపిత్త శ్లేష్మాదులవల్ల పుట్టిన శిరోరోగాలు, జ్వరాలు మొదలైనవి ఆధ్యాత్మిక తాపాలు. అధిభౌతికము అంటే భూతతత్త్వాలకు సంబంధించినవి. పెద్ద పులులు, దొంగలు మొదలైనవారివల్ల కలిగే కష్టాలు అధిభౌతికతాపాలు. శీతాతపవర్షాలు. (చలి, ఎండ, వాన) పిడుగులు మొదలైనవాటివల్ల కలిగే కష్టాలు అధిదైవిక తాపాలు.

ఇంతవరకు స్థూలశరీరాన్ని గురించి చెప్పారు. ఇక సూక్ష్మ శరీరం.

*సూక్ష్మ శరీరం నామ అపంచీకృతభూతకార్యం సప్తదశకం లింగం. సప్తదశకం నామ; జ్ఞానేంద్రియాణి పంచ, కర్మేంద్రియాణి పంచ, ప్రాణాదివాయవః పంచ, బుద్ధిర్మనశ్చేతి, జ్ఞానేంద్రియాణి కాని? శ్రోత్రత్వక్ చక్షుర్జిహ్వాఘ్రాణాని. శ్రోత్రేంద్రియం నామ,*

*కర్ణవ్యతిరిక్తం కర్ణశష్కుల్య వచ్ఛిన్ననభోదేశాశ్రయం శబ్దగ్రహణ శక్తిమదింద్రియం శోత్రేంద్రియ మితి. త్వగింద్రియం నామ, త్వగ్వ్యతిరిక్తం త్వగాశ్రయం ఆపాదతలమస్తకవ్యాపి శీతోష్ణాది స్పర్శ గ్రహణశక్తిమదింద్రియం త్వగింద్రియమితి. చక్షురింద్రి యం నామ, గోలోకవ్యతిరిక్తం గోలోకాశ్రయం కృష్ణతార కాగ్రవర్తి రూపాదిగ్రహణ శక్తి - మదింద్రియం చక్షురింద్రియమితి. జిహేంద్రియ నామ, జిహ్వా వ్యతిరిక్తం జిహ్వాశ్రయం జిహ్వాగ్రవర్తి రసాదిగ్రహణశక్తిమదింద్రియం జిహ్వేంద్రియ మితి. ఘ్రాణేంద్రియం నామ, నాసికావ్యతిరిక్తం నాసికా శ్రయం నాసికాగ్రవర్తి గంధాది గ్రహణ శక్తిమదింద్రియ ఘ్రాణేంద్రియ ముచ్యతే.*

ఇక సూక్ష్మశరీరం అనేది. దీనినే లింగశరీరం అంటారు. ఈ సూక్ష్మశరీరం పంచభూతతత్త్వాలతో ఏర్పడినది కాదు (అపంచీ కృతభూత కార్యం) పదునేడు ప్రతీకలతో (జ్ఞాపకములతో) కూడినది (సప్తదశకం లింగం) పదునేడు లింగములతో కూడినది కాబట్టి లింగశరీరమని కూడా అంటారు. ఈ పదునేడు లింగములు ఏవి? అంటే జ్ఞానేంద్రియాలు అయిదు, కర్మేంద్రియాలు అయిదు, ప్రాణాది వాయువులు అయిదు, మనస్సు, బుద్ధి అనేవి. జ్ఞానేంద్రియాలు అయిదు (1) శ్రోత్రము (చెవి) (2) త్వక్ (చర్మము) (3) చక్షుస్సు (కండ్లు) (4) జిహ్వా (నాలుక) (5) ఘ్రాణం (ముక్కు).

అయితే, ఈ చెవులు, కండ్లు మొదలైనవి పైకి కనిపిస్తూనే ఉన్నాయిగా! ఇవన్నీ సూక్ష్మశరీరానికి చెందినవిగా చెపుతారేమీ? ఇదెట్లా సంభవం? అని ప్రశ్నించవచ్చు. అందుకే ఆయా ఇంద్రియాలకు సరియైన నిర్వచనం ఇస్తున్నారు – పైకి కనిపించే చెవులుకాకుండా (చెవులకు భిన్నమైనట్టి) ఆ చెవుల రంధ్రాల్లో వ్యాప్తమైన ఉన్న శూన్యాన్ని ఆశ్రయించు కొని శబ్దాన్ని గ్రహించే శక్తి కలిగినట్టి సూక్ష్మ ఇంద్రియాన్ని శ్రోత్రేంద్రియం అంటారు. (అంతేగాని, పైకి కనిపించే చెవి దొప్పలు కావు. అట్లాగే మిగతా ఇంద్రియాలు కూడాను) అట్లాగే మనకు పైకి కనిపించే చర్మానికి భిన్నమైనదై, ఆపాదమస్తకం వ్యాప్తమై, శీతోష్ణాది స్పర్శాను భూతిని కలిగించే సూక్ష్మేంద్రియాన్ని త్వగింద్రియం అంటారు. కండ్లకు భిన్నమైనట్టి, కండ్లక్కు

ఆశ్రయించి ఉన్నట్టి, కనుగ్రుడ్డుకు అగ్రభాగంలో ఉంటూ రూపాన్ని గ్రహించే శక్తిగల సూక్ష్మేంద్రియాన్ని చక్షురింద్రియం అంటారు కేవలం నాలుక కాకుండా ఆ నాలుకను ఆశ్రయించి, నాలుక యొక్క అగ్రభాగంలో ఉంటూ తీపి, పులుపు మొదలైన రసాల్ని, రుచుల్ని గ్రహించగలిగే సూక్ష్మేంద్రియాన్ని జిహ్వేంద్రియం అంటారు. అట్లాగే పైకి కనిపించే ముక్కుకు భిన్నమైనదై, ఆ ముక్కును ఆశ్రయించి ముక్కుకు అగ్రభాగంలో గంధాదుల్ని (వాసనలను) గ్రహించే శక్తిగల సూక్ష్మేంద్రియాన్ని ఘ్రాణేంద్రియం అంటారు.

కర్మేంద్రియాణి కాని? వాక్ పాణిపాదపాయూపస్థాని, వాగింద్రియం నామ, వాగ్వ్యతిరిక్తం వాగాశ్రయం, అష్టస్థానవర్తి శబ్దోచ్చారణ శక్తి మదింద్రియం వాగింద్రియమితి. అష్ట స్థానాని, ఉరఃకంఠశిరస్తాలు జిహ్వదన్తోష్ఠనాసికాః. పాణీంద్రియం నామ, పాణివ్యతిరిక్తం కరతలాశ్రయం దానాదాన ప్రతిగ్రహశక్తిమ దింద్రియం పాణీంద్రియ మిత్యుచ్యతే. పాదేంద్రియం నామ, పాద వ్యతిరిక్తం పాదాశ్రయం పాదతలవర్తి గమనాగమనశక్తి మదింద్రియం పాదేంద్రియమితి. పాయ్వింద్రియం నామ, గుద వ్యతిరిక్తం గుదాశ్రయం పురీషోత్సర్గశక్తి మదింద్రియం పాయ్విన్ద్రియమితి. ఉపస్థేన్ద్రియం నామ, ఉపస్థవ్యతిరిక్తం, ఉపస్థాశ్రయం మూత్రశుక్రోత్సర్గశక్తి మదిన్ద్రియమ్ ఉపస్థేన్ద్రియమితి ఏతాని కర్మేందియాణి. ఇక, కర్మేంద్రియాలంటే ఏవి? వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థలు. అంటే మాట్లాడే ఇంద్రియమైన నాలుక, చేతులు, పాదాలు, గుదము, జననేంద్రియం బయటకు కనిపించే పనులు చేసేందుకు కారణమైనట్టి ఇంద్రియాలు. వాగింద్రియం అంటే, వాక్కుకు భిన్నమైనట్టి, వాక్కుకు ఆశ్రయమైనట్టి ఎనిమిది స్థానాల్లో ఉంటూ శబ్దోచ్చారణకు సమర్థమైనట్టి ఇంద్రియం! శబ్దోచ్చారణకుపయోగించే ఎనిమిది స్థానాలు– హృదయం, కంఠం, శిరస్సు ( మూర్ధం) తాలువు, నాలుక, దంతములు, పెదవులు, ముక్కు అనేవి. వీటిని వర్ణోత్పత్తి స్థానాలని మామూలుగా అంటూంటారు. పాణీంద్రియం అంటే–చేతులకు భిన్నమైనట్టి, చేతులను ఆశ్రయించి ఉండేటటువంటి, ఇచ్చి పుచ్చుకోవటానికి, పట్టుకోవటానికి– ప్రతిగ్రహం మొదలైన కార్యాలకు ఉపయోగపడే ఇంద్రియం. అట్లాగే, కేవలం కాళ్ళు మాత్రమేకాక, కాళ్ళను ఆశ్రయించి, ఉండేటటువంటి, పాదాల అడుగున ఉండేటటువంటి, నడవటానికి, రాకపోకలకు సమర్థమైనట్టి ఇంద్రియాన్ని పాదేంద్రియం అంటారు. కేవలం గుదం మాత్రమే కాక, గుదాన్ని ఆశ్రయించి ఉండి, మలవిసర్జనకు తగిన శక్తిని కలిగి ఉండే ఇంద్రియాన్ని

పాయవు అంటారు. అట్లాగే, జననేంద్రియానికి భిన్నమైయుండి, ఆ జననేంద్రియాన్నే ఆధారంగా చేసుకొని మూత్రాన్ని, శుక్రాన్ని విడుదల చేసేందుకు సమర్థమైన ఇంద్రియాన్ని ఉపస్థ అంటారు. ఈవిధమైన అయిదూ కర్మేంద్రియాలు. (ఇవి సూక్ష్మ శరీరానికి సంబంధించినవి కాబట్టి పైకి కనిపించే కేవలేంద్రియాలు కావు. ఈ సూక్ష్మేంద్రియాల శక్తులు మనకు స్వప్నావస్థలో కనిపిస్తాయి.)

*అన్తఃకరణం నామ మనో బుద్ధిశ్చిమహంకారశ్చేతి. మనఃస్థానమ గలాన్తమ్, బుద్ధేర్వదనం. చిత్తస్యనాభిః అహంకారస్య హృదయం. ఏ తేషాం విషయాః సంశయ నిశ్చయ ధారణాభిమానాః అనుసన్ధానాత్మికాన్తః కరణ వృత్తిశ్చిత్తమ్. అభిమానాన్తః కరణవృత్తిరహంకారః. చిత్తస్య బుద్ధావన్తర్భావః విషయ పరిచ్ఛిత్తి రూపత్వావిశేషాత్. బుద్ధేర్హ్య పూర్వోవిషయః చిత్తస్య పూర్వాను భవః మనసో బాహ్యాభ్యన్తరశ్చ. అహంకారస్య త్వనాత్మోపరక్త ఆత్మవేతి. ప్రాణాదివాయుపంచకంనామ ప్రాణాపాన సమానోదానవ్యానరూపాః. తేషాం స్థానవిశేషా ఉచ్యన్తే.*

మనస్సు, బుద్ధి, చిత్తం అహంకారం, వీటి అన్నింటిని కలిపి అంతఃకరణము అంటారు. మామూలుగా చెప్పుకోవాలంటే మనస్సునే హృదయం అని అంటాము. బుద్ధి అంటే నిశ్చయాత్మకమైన వృత్తి. చిత్తము అంటే అనుసంధాన కారినియైన వృత్తి. అహంకారము అంటే గర్వము లేక నేను, నాది అనే భావం.

ఇప్పుడు ఈ పైన చెప్పిన వాటి స్థానాలు చెపుతున్నారు– మనస్సుకు స్థానం గళానికి చివరిభాగం. బుద్ధికి స్థానం వదనం. చిత్తానికి స్థానం నాభి. అహంకారానికి స్థానం హృదయం. ఇక వీటి విషయాలను గురించి. మనస్సుకు విషయం సంశయం. బుద్ధికి విషయం నిశ్చయం. చిత్తానికి విషయం ధారణ. అహంకారానికి విషయం అభిమానం. అనుసంధానాత్మకమైనట్టి అంతఃకరణ వృత్తినే చిత్తము అంటారు. అట్లాగే అభిమానం యొక్క అంతఃకరణ వృత్తినిఅహంకారం అంటారు. చిత్తమనేది బుద్ధిలో అంతర్భావం చెంది ఉంటుంది. ఎందుచేతనంటే–బుద్ధియొక్క విషయం అభూతపూర్వమై ఉంటుంది– క్రొత్తదిగా ఉంటుంది.

చిత్తం యొక్క విషయం దాని పూర్వానుభవమై ఉంటుంది. మసనస్సుయొక్క విషయం బాహ్యంగాను, అభ్యంతరంగానూ కూడా అయి ఉంటుంది. కాని అహంకారానికి కష్టబూయిష్టమైనట్టి, కష్టగ్రస్తమైనట్టి అనాత్మయైనట్టి శరీరరమే ఆత్మ. ప్రాణము, అపానము, సమానము, ఉదానము, వ్యానము అనే లోపల ఉండే ఈ అయిదు వాయువులే అంతః కరణం యొక్క సాధారణ వ్యాపారం. ఎందుచేతనంటే, జీవనాడులద్వారా ఈ అయిదు వాయువులు (పంచప్రాణాలు) సమస్త వ్యాపారాలను నడిపిస్తున్నాయి. ఇక ఈ అయిదు వాయువుల స్థానాల్ని గూర్చి చెపుతున్నారు.

*హృది ప్రాణో గుదే పానః సమానో నాభిదేశతం:।ఉదాన: కంఠదేశస్థో వ్యానః సర్వశరీరగ:।ఏ తేషాం విషయాః ప్రాణః ప్రాగననవాన్, అపానః అవాగననవాన్. ఉదాన ఊర్ధ్వమనన వాన్. సమానః సమికరణవాన్. వ్యానః విష్వగననవాన్.*

ప్రాణం మొదలైన పంచవాముపుల యొక్క స్థానాలు – ప్రాణ వాయువు హృదయంలో ఉంటుంది. అపానవాయువు మలద్వారంలో ఉంటుంది. సమాన వాయువు నాభిదేశంలో ఉంటుంది. ఉదానవాయువు కంఠదేశంలో ఉంటుంది. వ్యానవాయువు శరీరమంతట వ్యాప్తమై ఉంటుంది. ఇక వీటి విషయాలు–ప్రాణవాయువనేది మొదటగా పీల్చబడేది. అపానవాయువు అధోగమనం కలది. ఉదానవాయువు ఊర్ధ్వగమనం కలది. సమాన వాయువు మధ్య ఉంటూ ఆహార రసాదుల్ని నాడులలో సమీకరిస్తూ ఉంటుంది. వ్యానవాయువు శరీరమంతట వ్యాపించి ఉంటుంది.

## 25

*ఏ తేషా ముపవాయవః పంచ-నాగః కూర్మశ్చ కృకరో దేవదత్తో ధనంజయ ఇతి.ఏ తేషాం విషయాః-నాగాదుద్గిరణంచాపి కూర్మాదున్మీలనం తథా।ధనంజయాత్ పోషణంచ దేవదత్తాచ్ఛ జృంభణం॥*

*కృకరాచ్ఛ క్షుతం జాతమితియోగవిదో విదు:।ఏ తేషాం జ్ఞానేంద్రియాదీనామధిపతయో దిగాదయ: దిగ్వాతార్కప్రచేతో*

*ఉ శ్వివహ్నీన్ద్రోపేంద్రమిత్రకాః తథా చన్ద్ర చతుర్వక్త్రో రుద్రః క్షేత్రజ్ఞ ఈశ్వరః॥ విశిష్టో విశ్వస్రష్టాచ విశ్వయోని రయోనిజఃక్రమేణ దేవతాః ప్రోక్తాః శ్రోత్రాదీనాం యథాక్రమమ్॥ ఏషు ప్రాణమయకోశః క్రియాశక్తిమాన్ కార్యరూపః॥ మనోమయః ఇచ్ఛాశక్తిమాన్ కరణరూపః॥ విజ్ఞానమయో జ్ఞానశక్తిమాన్ కర్తృరూపః॥ ఏతత్ సర్వం మిలితం లింగశరీరమిత్యుచ్యతే। కోశత్రయ ముచ్యతే.*

పైన చెప్పినట్టి ప్రాణవాయువులకు ఉపవాయువులు అయిదు ఉన్నాయి. అవి (1) నాగ (2) కూర్మ (3) కృకర (4) దేవదత్త (5) ధనంజయ, మనేవి. ఇక ఈ అయిదు ఉపవాయువులయొక్క విషయాలను చెపుతున్నారు. నాగమనే ఉపవాయువువల్ల త్రేణువులు, కూర్మంవల్ల ఉన్మీలనం– ప్రకాశితము. దనంజయంవల్ల పోషణము, దేవదత్తంవల్ల ఆవులింతలు, కృకరంవల్ల ఆకలి కలుగుతుందని యోగవేత్తలు అంటారు. ఇక జ్ఞానేంద్రియాదులకు అధిపతులను గూర్చి చెపుతున్నారు. శ్రోత్రాదులైన ఇంద్రియాలకు క్రమంగా దేవతలు దిక్ (దిశ) వాత (వాయువు) అర్క (సూర్య) ప్రచేతన (వరుణ) అశ్వి (అశ్వినీదేవతలు) వహ్ని (అగ్ని) ఇంద్ర, ఉపేంద్ర (విష్ణువు) మిత్రక (ఆదిత్యుడు) చంద్ర, చతుర్వక్త్ర (బ్రహ్మ) రుద్ర (శంకర) క్షేత్రజ్ఞ (దక్షుడు) ఈశర్వర (శక్తి సంపన్నుడు) విశిష్ట (విలక్షణ) విశ్వస్రష్ట (విధాత) విశ్వయోని (జగత్కారణ) అయోనిజ (జన్మలేని) వీరంతా ఇంద్రియాధులకు అదిష్ఠాన దేవతలు.

ప్రాణమయకోశం అనేది క్రియాశక్తితో కూడినదై యున్నందున కార్యరూపం కలదిగా ఉంటుంది. మనోమయకోశం ఇచ్ఛాశక్తితో కూడినదై యున్నందున కరణరూపం కలదిగా ఉంటుంది. విజ్ఞానమయకోశం జ్ఞానశక్తితో కూడినదైనందున కర్తృరూపం కలదిగా ఉంటుంది. ఇవన్నీ కలసి లింగశరీరం అవి వ్యవహరింపబడతాయి. ఇక ప్రాణమయ, మనోమయ కోశాదుల్ని గురించి చెపుతున్నారు.

## 26

*తథా చోక్తామ్-*

*పంచప్రాణమనోబుద్ధి దశేంద్రియ సమన్వితమ్।*

*అపంచీకృత భూతోత్థం సూక్ష్మాంగం భోగసాధనమ్॥*

ప్రాణా పాన వ్యానోదానాలైన పంచప్రాణాలు, మనస్సు, బుద్ధి, పది ఇంద్రియాలు, వీటితో కూడినట్టి, పంచీకృతం కానట్టి మహత్తత్త్వం నుండి పైకి వచ్చినట్టి, భోగసాదనమైనట్టి సూక్ష్మ శరీరమే లింగశరీరం. సూక్ష్మ శరీరానికి కూడా పదిహేడు ఇంద్రియాలు ఉంటున్నాయి. కాని పంచీకృతమైన స్థూలశరీరం ఉండదు. సుఖ దుఃఖానుభవానికి ఇది సాధనంగా ఉంటుంది.

## 27

*లీనమర్థం గమయతీతి వ్యుత్పత్త్యాలింగం శరీరమిత్యుచ్యతే। కథం లీనం? శ్రవణమననాదినా గమయతి జ్ఞాపయతి। శీర్యతే ఇతి వ్యుత్పత్త్యా శరీరమిత్యుచ్యతే। కథం శీర్యతే ఇతి చేత్? అహం బ్రహ్మాస్మీతి బ్రహ్మాత్మైకత్వ జ్ఞానేన శీర్యతే॥*

'లీనమర్థం గమయతి' అనే వ్యుత్పత్తినిబట్టి లింగశరీమనే పదం మచ్చింది. ఇది ఏ విధంగా లీనమౌతోంది? – ప్రచ్ఛన్నమౌతోంది? ఇది శ్రవణ మననాదుల ద్వారా మాత్రమే తెలుసుకోబడుతోంది. స్థూల శరీరం లాగా ప్రత్యక్షంకాదు. ఇది ప్రచ్ఛన్నంగా ఉంటుంది. కాబట్టి ఇది 'లీనము. ఇక శరీరమనే పదం 'శీర్యతే' అనే వ్యుత్పత్తిని బట్టివచ్చింది. శీర్యతే= క్షీణిస్తుంది. అనేది ఎట్లా సాధ్యమైంది? అంటే స్థూల శరీరం లాగా దీనికి కూడా క్షీణించటమనే గుణం ఎట్లా వచ్చింది? అనే దానికి సమాధానం– బ్రహ్మ, ఆత్మల ఏకత్వ బుద్ధివల్ల, అహం బ్రహ్మాస్మి అనే జ్ఞానంవల్ల ఇది నశిస్తోంది కాబట్టి లింగశరీరం అన్నారు.– ప్రచ్ఛన్నంగా ఉంటూ నశించేది, అని.

## 28

*దహ భస్మీకరణ ఇతి వుత్పత్త్యా లింగదేహస్య పృథివీ పురఃసరం క్షయ ఇత్యుచ్యతే.*

లింగదేహమని కూడా అంటారు కాబట్టి 'దహభస్మీకరణే' అనే వ్యుత్పత్తి ద్వారా లింగదేహమని అనవచ్చు. ఈ లింగదేహానికి పృథ్వీ పురస్సరంగా వినాశనం చెప్పబడ్డది–శరీరంతో పాటు ఇది కూడా నశించి పోతుంది.

## 29

*కారణ శరీరం నామ, శరీర ద్వయహేతుః॥*

కారణ శరీరం అంటే, స్థూల సూక్ష్మ (లింగ) దేహాలు రెంటికి హేతుభూతమైనట్టిది.

## 30

*అనాద్య నిర్వచనీయం సాభాసం బ్రహ్మాత్మైకత్వ జ్ఞాననివర్త్యమ్*
*అజ్ఞానం కారణశరీర మిత్యుచ్యతే.*

అనాదియైనట్టి, అనిర్వచనీయమైనట్టి, ప్రకాశ స్వరూపుడైనట్టి బ్రహ్మ, ఆత్మలు రెండూ ఒకటే అనే జ్ఞానాన్ని మరలిస్తూ ఉండేటటువంటి అజ్ఞానాన్నే కారణ శరీరం అంటారు. ఆత్మ పరమాత్మల అభిన్నత్వాన్ని – అద్వైతభావాన్ని అనుభవంలోకి రానీయకుండా నివారిస్తూ ఉంటుంది ఈ కారణ శరీరం.

## 31

*తథా చోక్తమ్-అనాద్యవిద్యా నిర్వాచ్యా కారణోపాధిరుచ్యతేఉపాధి త్రితయా దన్య మాత్మాన మవధారయేత్‌శీర్యతే ఇతి వ్యుత్పత్త్యా శరీర మిత్యుచ్చతే కథ మితి చేత్? బ్రహ్మాత్మైకత్వజ్ఞానేన శీర్యతే। దహ భస్మీకరణ ఇతి వ్యుత్పత్త్యా కారణశరీరస్యపృథివీ పురస్సరం క్షయ ఇత్యుచ్చతే అనృత జడదుఃఖాత్మక మిత్యుక్తమ్। అనృతం నామ కాలత్రయేషు అవిద్యమానవస్తు అనృత ముచ్యతే। జడం నామ స్వవిషయ పరవిషయ జ్ఞానరహితం వస్తు జడమ్ ఇత్యచ్యతే। దుఃఖమ్ నామ అప్రీతిరూం వస్తు దుఃఖమిత్యుచ్యతే సమష్టి వ్యష్ట్యాత్మక మిత్యుక్తమ్। కిం వ్యష్టిః? యథా వనస్య సమష్టిః కిం వ్యష్టిః? యాథా వృక్షస్య వ్యష్టిః యథా వా జలాశయస్య సమష్టిః జలస్య వ్యష్టిః। తద్వదనేకశరీర సమష్టిః। ఏకశరీరస్య వ్యష్టిః। అవస్థాత్రయం నామ, జాగ్రత్స్వప్నసుషుప్తయః జాగరణం నామ? ఇంద్రియై రర్థోప లబ్ధిర్జాగరణమ్। స్వప్నో నామ? జాగరిత*

*సంస్కార జప్రత్యయః సవిషయః సుషుప్తిర్నామ, సర్వవిషయ జ్ఞానాభావః జాగ్రత్ స్థూలశరీరాభిమానీ విశ్వః స్వప్నసూక్ష్మ శరీరాభిమానీ తైజసః సుషుప్తి - కారణశరీరాభిమానీ ప్రాజ్ఞః కోషపంచకం నామ, అన్నమయ - ప్రాణమయ - మనోమయ - విజ్ఞానమయ - ఆనందమయాఖ్యాః అత్రమయట్ ప్రత్యయో వికారార్థే తథా చ-*

ఇంకా ఈ విధంగా అన్నారు--

అనాదియైనట్టి, అవిద్య, మాయయొక్క రూపవే కారణ శరీరానికి ఉపాధి అంటారు. ఇటువంటి ఉపాధికి భిన్నమైనట్టి ఆత్మను మనం తెలుసుకోవాలి.

శరీరమనే పదం దీనికి వాడుతున్నారు – కారణ శరీరం అని. 'శీర్యతే' అనె వ్యుత్పత్తిని బట్టి శరీరమనే పదం సిద్ధిస్తోంది. అయితే, ఈ కారణ శరీరం ఎట్లా క్షయమౌతుంది? బ్రహ్మ, ఆత్మలయొక్క ఏకత్వ జ్ఞానంవల్ల, ఆత్మ పరమాత్మలు రెండూ ఒకటే అనే అభేద జ్ఞానంవల్ల। అటువంటి జ్ఞానం కలగటంతోనే ఆ కారణ శరీరం క్షయమైపోతుంది.

వేదాంతమతాన్ని అనుసరించి ఈ కనిపించే ప్రపంచానికంతకు నిమిత్తకారణము, ఉపాదాన కారణము కూడా పరబ్రహ్మయే! ఈ సర్వవ్యాపకుడైన ఆత్మయే విశ్వానికి జీవశక్తియైనవాడు; అంటే, మూల తత్త్వము! అతని వల్లనే ఇవన్నీ పుడుతున్నాయి. ఆ పరబ్రహ్మలోనే లయమైపోతాయి. కాబట్టి ఆత్మపరమాత్మలు ఒకటే అనే జ్ఞానం కలగటంవల్ల శరీరమనేది అసత్యము, మిథ్య అని తెలిపోవటంతో శరీరం శీర్యమైపోతుందని భావము. 'దహ భస్మీకరణే' అనే వ్యుత్పత్తివల్ల (దహింపబడేది దేహం) దీనికి పృథ్వీ పురస్సరంగా వినాశనం చెప్పబడ్డది. అసత్యము, జడము అయినది ఏదైనా దుఃఖాత్మకమే! దేనిని అనృతము అంటాము? భూత, భవిష్యత్, వర్తమానాలలో లేని వస్తువు ఏదో అది అనృతం! అసత్యం! జడమంటే ఏది? స్వవిషయమైన పరవిషయకమైన జ్ఞానం లేనిది. అంటే తనను గురించి యితరమైన వాటిని గురించిన జ్ఞానం దేనికి లేదో అది జడం. దుఃఖమంటే ఏమిటి? అప్రీతికరమైన వస్తువును దుఃఖం! అంటారు మనకు ఇష్టంకానిది ఏదో అది దుఃఖం! ఈ దుఃఖమనేది వ్యష్టిగాను వుండవచ్చు. సమిష్టిగాను ఉండవచ్చు–వ్యష్టి దుఃఖము, సమిష్టి

దుఃఖము అని. వ్యష్టి అంటే ఏమిటి? సమిష్టి అంటే ఏమిటి? అనేక వృక్షాలతో కూడిన అడవిని మనం సమిష్టి అనుకుంటే ఒక చెట్టును వ్యష్టి అనుకోవచ్చు. అంటే అడవి అనేది సముచ్ఛయాత్మకమైన–అనేకంతో కూడిన వ్యాప్తి. అట్లాగే సముద్రాన్ని మనం నీటియొక్క సమిష్టిరూపంగా గ్రహిస్తే అందులోని కొంత నీటిని వ్యష్టి రూపంగా గ్రహించవచ్చు! అట్లాగే అనేక శరీరాల సమూహం సమిష్టి అయితే, ఒక శరీరం వ్యష్టి అవుతుంది.

ఇక అవస్థాత్రయం–మూడు స్థితులను గూర్చి –జాగ్రత్, స్వప్న సుషుప్తులనేవి మూడు అవస్థలు. ఇంద్రియాలద్వారా–శరీరావయవాల ద్వారా, అర్థోపలబ్ధిని పొందటం జాగరణము అంటారు. అంటే శరీరా వయవాల ద్వారా జ్ఞానాన్ని పొందటం! ఇంద్రియాల ద్వారా ప్రయోజనాన్ని పొందటం! ఇది జాగ్రదవస్థలోనే సాధ్యం. స్వప్నమంటే ఏమిటి? ప్రబుద్ధమైన సంస్కారంవల్ల పుట్టిన సవిషయక విశ్వాసాన్ని స్వప్నం అంటారు. అంటే జాగ్రదవస్థాలో మనకు కొన్ని అనుభవాలు కలుగుతున్నాయి. ఆ అనుభవాలు సంస్కార రూపంలో ఉంటున్న వాటిని (విషయాలను) నిజమని విశ్వసిస్తున్నాయి. ఆ స్థితినే స్వప్నం అంటారు. స్వప్నంలో మనకు అటువంటి నమ్మకం ఎట్లా కలుగుతోంది? అంతకు పూర్వమే ఆయా విషయాలకు సంబంధించిన సంస్కారం లోనదాగి ఉండటంవల్ల! ఆ సంస్కారమే స్వప్నంలో మేల్కొంటుంది–ప్రబుద్ధ మౌతుంది.

ఇక అన్ని రకాలైన విషయాలకు సంబంధించిన జ్ఞానంయొక్క అభావమే సుషుప్తి. మనం ఈ స్థితినే గాఢనిద్ర అంటాము. ఈ స్థితిలో ఇంద్రియాలన్నీ తమకు సంబంధించిన విషయాలను అనుభవించలేవు. కాబట్టి వాటి జ్ఞానాన్ని ఇవ్వలేవు. అయితే ఈ మూడు స్థితులలోను కూడా ఆత్మ అనేది ద్రష్టిగానే ఉంటోంది. ఆయా స్థితులలో ఉండే పురుషుని ఏ ఏ పేర్లతో వ్యవహరిస్తారో చెపుతున్నారు. జాగ్రదవస్థలో ఉండే ఈ నశ్వరమైన స్థూలశరీరాభిమానియైన పురుషుడు 'విశ్వ' సంజ్ఞ కలవాడు. స్వప్నావస్థయందుండే లింగశరీర (సూక్ష్మవరీర) అభిమానియైన పురుషుని 'తైజసుడు' అంటారు–ప్రకాశయుక్తుడు అని. సుషుప్తిలో కారణ శరీరా భిమానియైన పురుషుని ప్రాజ్ఞుడు (మనీషి) అంటారు. ఇక పంచ కోశములను గూర్చి – పంచకోశములు అంటే (1) అన్నమయకోశము (2) ప్రాణమయకోశము (3) మనోమయ కోశము (4) విజ్ఞానమయకోశము (5) ఆనందమయకోశము. అన్న వికారమైన, యనోవికారమైన అనే అర్థాన్ని వ్యక్తం చేయటానికై మయట్ ప్రత్యయాన్ని వాడారు.

*పితృ భుక్తాన్నజాద్ వీర్యాజ్జాతో న్నేనైవ వర్ధతే।*
*దేహః సోఽ న్నమయో నాత్మాప్రాక్ చోర్ధ్వతదభావతః॥*

తల్లిదండ్రులు భుజించిన అన్నంవల్ల శుక్రశోణితోత్పత్తి జరుదుతోంది. ఆ శుక్రశోణిత సంయోగంవల్ల దేహం ఉత్పత్తి అవుతోంది. (సంతానం కలుగుతోంది). అన్నంవల్లనే ఆ దేహం వృద్ధి పొందుతోంది. అందుచేతనే దీనిని అన్నమయకోశం అన్నారు – అన్నరూపమైనట్టి కోశం. ఈ అన్నమనేది దానికి పూర్వంగాని (సృష్టికి పూర్వంగాని) తరువాతగాని ఆ రూపంలో (ఆత్మ–లేక జీవరూంలో) లేనేలేదు. శరీరం అంటే ఆత్మకాదు. అని భావం. ఈ పంచకోశాల్లో ఏదీ ఆత్మ (జీవాత్మ) కాదు అని చెపుతున్నారు.

## 32

*పూర్ణో దేహే బలం యచ్ఛన్నక్షాణాం యః ప్రవర్తకః।*

వాయుః ప్రాణమయో నాసావాత్మా చైతన్యవర్జనాత్॥ దేహంలో పూర్తిబలాన్ని యిాస్తూ, ఇంద్రియాల్ని ప్రేరేపిస్తూ ఉండే దానిని ప్రాణవాయువు అంటారు. ఇది చైతన్య వర్జితమైనది – చైతన్యం లేనిది. కాబట్టి ఇది ఆత్మ (బీవాత్మ) కాదు.

## 33

*ఆహన్తాం మమతాం దేహే గేహాదౌ చ కరోతి యః।*

కామాద్యవస్థయా భ్రాన్తో నాసావాత్మా మనోమయః॥మనస్సు అనేది గృహాదులయందు, దేహమందు అహం మన్యతను మమకారాన్ని పుట్టుస్తూ ఉంటుంది. కామాది అవస్థలవల్ల భ్రాంతి కలిగి ఉంటుంది. కాబట్టి అది మనోమయమే తప్ప ఆత్మ (జీవాత్మ), కాదు.

## 34

*లీనా సుప్తౌ వపుర్బోధే వ్యప్ను మాదానఖాగ్రగా।*
*చిచ్ఛాయోపేతధీర్నాత్మా విజ్ఞానమయ శబ్దభాక్॥*

జాగ్రదవస్థయందలి శరీరమే, సూప్తావస్థలో–నిద్రావస్థలో లీనమై (ప్రచ్ఛన్నంగా ఉంటూ) నఖాగ్ర పర్యంతం వ్యాప్తమై, అధికారం చలాయిస్తూ ప్రజ్ఞాదృష్టి అనే భ్రమతో కూడిన బుద్ధినే విజ్ఞానమయంకోశం అంటారు. అంతే తప్ప అది జీవాత్మ కాదు.

## 35

*కాచిదన్తర్ముఖా వృత్తిరానంద ప్రతిబింబభాక్।*

పుణ్యభోగే భోగశాన్తౌ నిద్రా రూపేణ లీయతే॥పుణ్యాలను అనుభవించటంలో అంతర్ముఖమై ఉంటూ, సర్వేంద్రియాలకు సామాన్యమై, అంతర్లీనమైనట్టి ఏదో ఒక వృత్తి–అంతః కరణ పరిణామం–ఆనందమయమైన వాయువు అనే పేరుతో విఖ్యాతమై ఉంది. పుణ్యభోగములు శాంతించిన పిమ్మట ఆ అంతఃకరణ వృత్తియే నిద్రరూపంలో లీనమైపోతుంది. మిగతా కోశాల్లాగానే ఇది కూడా జీవాత్మ కాదు.

## 36

*దేహాదభ్యంతరం ప్రాణః ప్రాణాదభ్యంతరం పునః।*
*తతః కర్తా తతో భోక్తా గుహా సేయం పరంపరా॥*

ఈ శరీరంలోపల ప్రాణం దానిలోపల మనోమయాది కోశాలు దాని తరువాత కర్తయైన పురుషుడు, దాని తరువాత భోక్తయైన పురుషుడు–ఉపభోగకర్తయైన పరమేశ్వరుడు! అదే గుహ, అంటే బ్రహ్మకు నివాస స్థానం. ఇదీ పరంపర–అనుబంధం.

## 37

పంచకోశాలను ఇంకా విపులంగా వివరిస్తున్నారు–

*స్థూలశరీరమ్ అన్నమయకోశః। మాతృపితృభ్యామన్నే భుక్తే సతి శుక్రశోణితా కారేణ పరిణతం తయోః సంయోగాదేవ దేహాకారేణ పరిణమతే। కోషవదాచ్ఛాదకత్వాత్ కోష ఇత్యుచ్యతే। అన్నవికారత్వే సతి ఆత్మానమాచ్ఛాదయతి। కథమ్ అపరిచ్ఛిన్నమాత్మానమ్ పరిచ్ఛిన్నమివ జన్మాదిషడ్భావవికార రహితమాత్మానం జన్మాదిషడ్భావ వన్తమివ, తాపత్రయాది రహితమాత్మానం తాపత్రయవన్తమివ ఆచ్ఛాదయతి, యథా కోషః ఖడ్గ మాచ్ఛాదయతి, యదాతుషస్తండుల మాచ్ఛాదయతి, యథా వా గర్భం జరాయురావరయతి, తథా ప్రాణమయకోషో*

*నామ కర్మేంద్రియాణి పంచ, ప్రాణాది - వాయవః పంచ, ఏతత్ సర్వం మిలితం సత్ ప్రాణమయ కోష ఇత్యుచ్యతే। ప్రాణ వికారే సతి వక్త ృత్వాది రహితమాత్మానం వక్తారమివ, దానాది రహితమాత్మానం దాతారమివ, గమనాదిరహిత మాత్మానం గన్తారమివ క్షుత్పిపాసాది రహిత మాత్మానం క్షుత్పిపాసా వంతమివావారయతి। మనోమయకోషో నామ, జ్ఞానేంద్రియాణి పంచ మనశ్చ. ఏతత్ సర్మంమిలిత్వ మనోమయ కోష ఇత్యుచ్యతే। కథం మనోవికారే సతి సంశయాది రహిత మాత్మానం సంశయువన్తమివ, శోక-మోహాది రహితమాత్మానం శోకమోహాదిమన్తమివ, దర్శనాదిరహిత మాత్మానం దర్శనాది మన్తమివా వారయతి। విజ్ఞానమయకోష నామ, జ్ఞానేంద్రియాణి పంచ, బుద్ధిశ్చ ఏతత్ సర్వం మిలిత్వా విజ్ఞానమయకోషో ఇత్యుచ్యతే కర్తృత్వభోక్తృత్వాద్యభిమానేన ఇహలోక పరలోకగామీ వ్యవహారికో జీవ ఇత్యుచ్యతే॥*

పైకి కనిపిస్తూ ఉండే ఈ స్థూలదేహమే అన్నమయకోశం. దీనిని అన్నమయ కోశం అని ఎందుకన్నారు? అన్నంతో-ఆహారంతో తయారైంది కాబట్టి! ఎట్లా? తల్లిదండ్రులు భుజించిన అన్నం శుక్రశోణితరూపంలోకి మారుతుంది. ఆ శుక్రశోణితాల కలయికవల్ల ఈ దేహంయొక్క ఆకారం ఏర్పడుతోంది. కత్తిని ఒర ఏ విధంగా కప్పి ఉంచుతుందో ఆ విధంగా అన్నంవల్ల ఏర్పడ్డ ఈ శరీరం ఆత్మకు ఆచ్ఛాదనంగా-ఒరలాగా ఉంటోంది. కాబట్టి ఇది అన్నంవల్ల ఏర్పడ్డకోశం-అందుచేత అన్నమయకోశం అన్నారు. ఈ శరీరం ఏమి చేస్తోంది? ఎందుకు ఉపయోగిస్తోంది? హద్దు-అంతము అనేవి లేని ఆత్మకు ఈ శరీరం ఒక హద్దును ఏర్పరుస్తోంది ఈ శరీరమనేది జన్మమరణాలు లేని ఆత్మను, జన్మ మరణాది షడ్భావ వికారములు కలదానినిగా చేస్తోంది. అంటే ఆత్మకు పుట్టుక, వృద్ధి (పెరుగుదల) బాల్యం, యౌవనం, వార్ధక్యం, మరణం అనే ఆరు విధాలైన మార్పులు ఉండవు. ఈ శరీరం అటువంటి మార్పులు లేని ఆత్మను పైన చెప్పిన మార్పులు కలదానినిగా చేస్తోంది.

ఈ అన్నమయ కోశమే తాపత్రాయాలు ఏమీలేని ఆత్మను తాపత్రయాలు కలదానినిగా చేస్తోంది. కత్తిని ఒర ఆచ్ఛాదించి ఉన్నట్లుగా, బియ్యపుగింజను పొట్టు (ఊక) కప్పి ఉన్నట్లుగా, గర్భాశయంలోని పిండాన్ని జరాయువు కప్పి ఉంచినట్లుగా ఇది ఆత్మను కప్పి ఉంచుతోంది.

అట్లాగే ప్రాణమయ కోశమనేది కూడా! ఈ ప్రాణమయ కోశం అనేది ఐదు కర్మేంద్రియాలతో, ప్రాణాపానాది అయిదు వాయువులతో కలసి ఏర్పడుతుంది. ప్రాణవికారమైనది కాబట్టి. ప్రాణంతో తయారైనది కాబట్టి ప్రాణమయకోశం అన్నారు. ఈ ప్రాణమయకోశం అనేది మాట్లాడటంలాంటి (వక్తృత్వాది) గుణాలులేని ఆత్మను వక్తలాగా, దానాది గుణాలులేని ఆత్మను దాతలాగా, గమనాదులు (నడక) లేని ఆత్మను గమనశీలమైన దానినిగా నడిచేదానిలాగా, ఆకలిదప్పికలు లేని ఆత్మను ఆకలి దప్పికలు ఉన్నదానిలాగా కప్పి ఉంచుతుంది.

ఇక ఈ ప్రాణమయకోశానికి లోపలిది మనోమయకోశం. ఐదు విధాలైన జ్ఞానేంద్రియాలు, మనస్సు కలసి, మనోమయకోశం ఏర్పడుతుంది. ఎట్లా? ఇది మనోమయమైనది కాబట్టి సంశయాలేవీ లేనట్టి ఆత్మను సందేహశీలమైన దానినిగాను, శోకము, మోహము మొదలైనవి ఏవీ లేనట్టి ఆత్మను శోకమోహాదులు కలదానినిగాను, ప్రత్యక్షదర్శనం లేని ఆత్మను సాక్షాత్కారయుక్తమైనదానిగా (కనిపించే దానినిగా) ఆచ్ఛాదించి ఉంచుతుంది.

విజ్ఞానమయకోశమనేది జ్ఞానేంద్రియాలు అయిదు, బుద్ధి కలసి ఏర్పడుతోంది. ఈవిధమైన కర్తృత్వ భోక్తృత్వాది అభిమానం వల్ల (నేను చేస్తున్నాను, నేను అనుభవిస్తున్నాను అనే అహంకారంవల్ల) ఈలోకంలో పుడుతూ, పరలోకానికి పోతూ ఉండే దానిని వ్యావహారికంగా జీవుడని జీవాత్మ అని అంటారు.

## 38

*విజ్ఞాన వికారత్వే సతి అకర్తార మాత్మానం కర్తారమివ, అవిజ్ఞాతార మాత్మానం, విజ్ఞాతార మివ, నిశ్చయ రహిత మాత్మానం నిశ్చయవంతమివ, జాడ్యాది రహిత మాత్మానం*

*జాడ్యాదిమన్తమివావరయతి । ఆనందమయకోషో నామ ప్రియమోదప్రమోదవృత్తిమత్ అజ్ఞాన ప్రధానమంతఃకరణమ్ ఆనన్దమయకోష ఇత్యుచ్యతే । కథం ప్రియమోద ప్రమోదరహితమాత్మానం ప్రియమోదప్రమోదవస్తమివ, ఆభోక్తార మాత్మానం భోక్తారమివ పరిచ్ఛిన్నసుఖరహిత మాత్మానం పరిచ్ఛిన్న సుఖవంతమివ ఆచ్ఛాదయతి ।*

*ఇష్టపుత్రాది దర్శనజం ప్రియమ్ । ప్రియలాభనిమిత్తో హర్షో మోద। న ఏవ చ ప్రకృష్టో హర్షః ప్రమోదః । ఏ తేషు కోషేషు మద్యే విజ్ఞానమయో జ్ఞాన శక్తిమాన్ కర్తృ రూపః। మనోమయ ఇచ్ఛాశక్తిమాన్ కారణరూపః । ప్రాణమయః క్రియాశక్తిమాన్ కార్యరూపః । తత్ర హేతు మాహ - యోగ్యత్వా దేవమేతేషాం విభాగ ఇతి వర్ణయన్తి । ఏతత్ కోషత్రయం మిలితం సూక్ష్మ శరీర మిత్యుచ్యతే। సమష్టి-వ్యష్టీ శాస్త్రాంతరా ద్విశేషతో జ్ఞేయే శరీరత్రయ విలక్షణత్వ ముచ్యతే.*

ఇది విజ్ఞానం వల్ల ఏర్పడినట్టి కోశం కాబట్టి, ఆత్మకు కర్తృత్వాభిమానం లేకపోయినా దానిని (ఆత్మను) కర్తలాగా, అవిజ్ఞేయమైనట్టి (తెలియరానట్టి) ఆత్మను విజ్ఞేయమైన దానినిగా, సందిగ్ధంగా ఉండే ఆత్మను నిశ్చయమైన దానినిగా జడంగా ఉండనట్టి (నిష్క్రియత్వ) శూన్యమైనట్టి, ఆత్మను అనాసక్తమైనదానినిగా జడంగా ఈ విజ్ఞానమయకోశం అనేది ఆవరించి ఉంచుతుంది.

ప్రియము, మోదము, ప్రమోదము, అంతఃకరణ పరిణామంగా కలిగినట్టి, అజ్ఞాన ప్రధానమైనట్టి అంతఃకరణాన్ని ఆనందమయకోశం అంటారు. ఆత్మకు ప్రియము, మోదము, ప్రమోదము అనేవి లేవు. కాని ఈ ఆనందమయకోశమనేది ప్రియము, మోదము, ప్రమోదము ఏవీలేని ఆత్మను ఇవి కలదానినిగా కప్పి ఉంచుతుంది. ప్రియము, మోదము, ప్రమోదాల్ని ఆత్మ అనుభవించేది (భోక్త) కాకపోయినా, దానిని భోక్తగాను, పరిమితమైన గుణాలు లేని ఆత్మను పరిమితమైన గుణాలు కలదిగాను ఈ ఆనందమయ కోశం ఆచ్ఛాదించి ఉంచుతుంది – ఆత్మను.

అయితే, ప్రియము అంటే ఏమిటి? పుత్రుడు మొదలైన వారిని చూడటంవల్ల, వారు కనిపించటంవల్ల కలిగే సంతోషాన్ని ప్రియము అంటారు. కేవలం పుత్రాది దర్శనంవల్లనేకాదు, ఆ కోవకు చెందిన సంతోషం అని భావం. అటువంటి ప్రియమైన వాటిని పొందటంవల్ల కలిగే సంతోషాన్ని మోదము అంటారు. ఆ మోదమే అత్యధికంగా లభించినపుడు దానిని ప్రమోదము అంటారు. ఇవన్నీ సంతోషంలో తరతమ భేదాలు.

ఈ కోశాల్లో విజ్ఞానమయకోశం జ్ఞానశక్తితో కూడిన కర్తరూపంలో ఉంటుంది. మనోమయకోశమనేది ఇచ్ఛాశక్తితో కూడిన కరణరూపంలో ఉంటుంది. ప్రాణమయకోశం క్రియాశక్తితో కూడిన కార్యరూపంలో ఉంటుంది. వీటి సామర్థ్యాన్ని బట్టి వీటిని విభజించి వర్ణిస్తున్నారు. ఈ కోశాలు కలిసి సూక్ష్మశరీరం లేక లింగశరీరం అని వ్యవహరింపబడతాయి. వ్యష్టి రూపంలో, సమష్టిరూపంలో, ఇతర శాస్త్రాలవల్ల తెలుసుకోవలసినట్టి ఈ స్థూల, సూక్ష్మ కారణ శరీరాలను గూర్చి వాటి విలక్షణత్వాన్ని గూర్చి వివరిస్తున్నారు.

## 39

*కథమ్ సత్య సర్వపః అసత్యస్వరూపోన భవతి? అసత్యస్వరూపః సత్యస్వరూపోన భతి। జ్ఞానస్వరూపః జడస్వరూపోన భవతి। జడస్వరూపః జ్ఞన స్వరూపో భవతి। ఏవం సుఖ స్వరూపో దుఃఖస్వరూపోన భవతి। దుఃఖస్వరూపః సుఖస్వరూపోన భవతి। ఏవం శరీర త్రయ విలక్షణముక్త్వా అవస్థాత్రయ సాక్షిత్వ ముచ్యతే.*

సత్యస్వురూపం కలది అసత్య స్వరూపం కలదిగా ఎన్నడూ కాదు. అట్లాగే, అసత్యస్వరూపమైనది సత్య స్వరూపం కలదిగానూ కాదు. జ్ఞాన స్వరూపమైనది ఎన్నడూ అజ్ఞాన స్వరూపం కలదిగానూ కాదు. అజ్ఞాన స్వరూపమైనది (జడమైనది) జ్ఞాన స్వరూపమూకాదు. సుఖస్వరూపమైనట్టిది దుఃఖ స్వరూపం కలదికాదు. అట్లాగే దుఃఖస్వరూపమైనది సుఖ స్వరూపమైనదీ కాదు. ఈ విధంగానే ఈ మూడు శరీరాలు విలక్షణమైనవి అనే విషయం చెప్పి, పిమ్మట అవస్థాత్రయం (జాగ్రత్, స్వప్న, సుషుప్తి)లోని సాక్షిత్వాన్ని గూర్చి చెప్పబోతున్నారు.

## 40

*కథమ్? జాగ్రదవస్థా జాతా జాగ్రదవస్థా భవతి, జాగ్రదవస్థా భవిష్యతి। స్వప్నావస్థా జాతా, స్వప్నావస్థా భవతి, స్వప్నావస్థా భవిష్యతి। సుషుప్త్యవస్థా జాతా సుషుప్త్యవస్థా భవతి, సుషుప్త్యవస్థా భవిష్యతి। ఎవమవస్థాత్రయమవికారతయా జానాతి। అత ఆత్మనః పంచకోష విలక్షణత్వం దృష్టాంతరూపేణ ప్రతిపాతయతి। మమేయంగౌః। మమాయంవత్సః మమాయం కుమార ః, మమేయం కుమారీ, మమేయం స్త్రీ, ఏవమాదిపదార్థవాన్ పురుషో న భవతి। తేభ్యో విలక్షణ ః। తథా మమ అన్నమయకోషః। మమ ప్రాణమయ కోషః । మమ మనోమయకోషః మమ విజ్ఞానమయకోషః। మమ ఆనన్దమయ కోషః। ఏవం పంచకోషవానాత్మాన భవతి। తేభ్యో విలక్షణః సాక్షీ।*

*అశబ్ద మస్పర్శమరూప్యమవ్యయం తథా రసం నిత్య మగంధ వచ్చ యత్ । అనాద్యనంతం మమతః పరంధ్రువం నిచాయ్యతం మృత్యు ముఖాత్ ప్రముచ్యతే।। ఇత్యాది శ్రుతేః।*

అయితే, జాగ్రదవస్థ అనేది ఎట్లా కలిగింది? ఎట్లా కలుగుతోంది? ఎట్లా కలుగుతుంది? స్వప్నావస్థ అనేది ఎట్లా కలిగింది ? ఎట్లా కలుగుతోంది? ఎట్లా కలుగుతుంది? ఈ విషయాలు మనకు ఎట్లా తెలుస్తాయి? దేని ద్వారా మనం తెలుసుకోగలుగుతాము? ఈ పైన చెప్పిన మూడు అవస్థలు వికారములతో కూడినవి. ఈ వికారములతో కూడిన ఈ మూడు అవస్థలను మనం నిర్వికారమైన దానివల్ల మాత్రమే తెలుసుకోగలుగుతాం. అందుచేత ఆత్మ అనేది అన్నమయాది పంచకోశాలకు భిన్నమైనది (విలక్షణమైనది) అనే విషయాన్ని దృష్టాంతం ద్వారా ప్రతిపాదిస్తున్నారు.- ఈ ఆవు నాది. ఈ దూడ నాది. ఈ కొడుకు నావాడు. ఈ కొమార్తె నాది. ఈ భార్యనాది అన్నట్లుగా ఆత్మ అనేది ఒక పదార్థంకాదు. (ఈ ఆత్మనాది అని చెప్పే వీలులేదు) వీటి అన్నింటికి విలక్షణమైనది-భిన్నమైనది. అట్లాగే, ఈ భౌతిక శరీరం (అన్నమయకోశం) నాది, ఈ ప్రాణమయకోశం నాది. ఈ మనోమయ కోశం

నాది, ఈ విజ్ఞానమయ, ఆనందమయ కోశాలు నావి అన్నట్లుగాను, ఈ పంచ కోశాలతో కూడి ఉన్నది కూడా ఆత్మకాదు. వీటి అన్నింటికంటే విలక్షణమైనట్టి, వీటి అన్నింటికి ద్రష్ట అయినట్టిది ఆత్మ!అది శబ్దహీనమైది-దానికి శబ్దంలేదు. దానికి ఆకారంలేదు. దానికి నాశనంలేదు. అది రసహీనమైనది. నిత్యమైనది. గంధ రహితమైనది. అనాదియైనది. అనంతమైనది. అది మహత్తు (గొప్పది) సర్వ శ్రేష్ఠమైనది. ధ్రువమైనది స్థిరమైనది అని తెలుసుకొని నిశ్చయించుకొన్నవాడు మృత్యువునుండి విముక్తుడౌతాడు అని శ్రుతివచనం.

## 41

*ఇదానీ మాత్మనః సచ్చిదానంద స్వరూపత్వముచ్యతే। సద్రూపత్వం నామ, కేనాప్యబాధ్యమానత్వేన కాలత్రయే ష్వేకరూపేణ విద్య మానత్వముచ్యతే। చిద్రూపం నామ, సాద నాన్తర నిరపేక్షతయా స్వయం ప్రకాశమానః సన్ స్వస్మిన్నారోపిత సర్వ పదార్థావభాసక వస్తుత్వం చిద్రూపత్వ మిత్యుచ్యతే। ఆనంద స్వరూపం నామ, పరమప్రేమా స్పదత్వం నిత్యనిరతిశయ త్వమానందత్వ మిత్యుచ్యతే। నిత్య విజ్ఞాన మనందం బ్రహ్మ రాతి దాతుః పరాయణమితి శ్రుతేః। ఏవః నిత్యశుద్ధబుద్ధ ముక్త స్వభావం। బ్రహ్మైహమస్మీతి సంశయాసంభావనా విపరీత భావనా రాహిత్యేన యస్తు జానాతి సజీవన్ముక్తో భవతీతి॥*

ఇక, ఇప్పుడు ఆ ఆత్మయొక్క సత్, చిత్, ఆనంద స్వరూపత్వాన్ని గురించి చెపుతున్నారు. ముందు సద్రూపాన్ని గరించి చెపుతున్నారు ఆత్మ అనేది ఈ సృష్టిలో, ఈవిశ్వంలో దేనిచేత అడ్డగింపబడదు. అది నిర్నరోధము. అప్రతిహతమైనది. మూడు కాలాల్లోను, ఏ విధమైన మార్పు లేకుండా అభిన్నస్వరూపంలో ఉండేది కాబట్టి అది సత్! సత్యం!

తరువాత (చిత్‌శక్తి) ఈ చిచ్ఛక్తి అనేది ఇతర సాదనాలు వేటినీ అపేక్షించకుండా స్వయం ప్రకాశమానమై ఉంటుంది. తనలోనే సమస్త పదార్థాలను భాసింప చేయజాలిన తేజోవంతమైనది. ఇదే చిద్రూపత్వం- జ్ఞాన స్వరూపత్వం.

ఆనంద స్వరూపమనేది పరమ ప్రేమాస్పదమైనది. నిత్యమైనది. నిరతిశయమైనట్టి ప్రసన్నతకు ప్రతీకమైనట్టిది. ఇటువంటి సత్, చిత ఆనందస్వరూపం కలది ఆత్మ–బ్రహ్మ. ఈ బ్రహ్మ నిత్యుడు (శాశ్వతుడు విజ్ఞాన స్వరూపుడు, ఆనంద స్వరూపుడు. ప్రసన్నతను ప్రదానం చేయటంలో నిరతుడై యుండేవాడు అని వేదాలు చెపుతున్నాయి. ఈ నిత శుద్ధ బుద్ధ ముక్త స్వభావం కలిగినట్టి బ్రహ్మను నేనే (అహం బ్రమ్మసి అనే విషయంలో సందేహంగాని, అశక్తతగాని, ప్రతికూల భావంగా లేకుండా నిశ్చయమైన బుద్ధితో (నేనే బ్రహ్మనని) తెలుసుకొనేవాడు, విధమైన ఆత్మజ్ఞానంవల్ల (ఆత్మ వివేకంవల్ల) జీవన్ముక్తుడౌతాడు.

ఇతి శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్య,<br>
శ్రీమద్గోవింద భగవత్పూజ్య పాద శిష్య,<br>
శ్రీమదాద్య శంకరాచార్య విరచితః<br>
ఆత్మా నాత్మ వివేకః సమాప్తః

–oOo–

**శ్రీ నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు గారి గ్రంథములు**

1. ఉపనిషద్దర్శనము భాగం 1
   (తైత్తిరీయ, ఈశ, కేన, ప్రశ్న, మాండూక్య, కఠోపనిషత్తులు)
2. ఉపనిషద్దర్శనము భాగం 2 (బృహదారణ్యకోపనిషత్తు)
3. ఉపనిషద్దర్శనము భాగం 3(ఛాందోగ్య, ఐతరేయ, ముండకోపనిషత్తులు)
4. ఉపనిషద్దర్శనము భాగం 4
   (శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులు)
5. బ్రహ్మసూత్ర దర్శనము (శారీరక మీమాంస)
6. గీతా దర్శనము 9భగవద్గీత)
7. ఆత్మబోధ
8. ఆత్మానాత్మ వివేకము
9. అపరోక్షానుభూతి
10. వివేక చూడామణి
11. పతంజలి యోగదర్శనము
12. ధ్యానయోగము
13. వేదాంత పంచదశి (మాధవ విద్యారణ్య మునీంద్రకృతము)
14. యోగ వాసిష్టసారము
15. పరలోకము – పునర్జన్మ
16. మన వివాహ వ్యవస్థ

పై గ్రంథములన్నియు క్రింది వెబ్‌సైట్ నుంచి ఉచితంగా డైన్‌లోడ్ చేసుకోవచ్చును.

website : www.sriramakrishnatapovanam.org

Email : chvenkateswarlu30@gmail.com